# SASANKAVATHI

by

Tirumala Ramachandra.

*Publishers :*

VENKATARAMANA PUBLICATIONS

Publishers & Book Sellers

Sultan Bazaar, Hyderabad (A. P.)

Price Rs. 2-25.



# శశాంకవతి

రచయిత :

తిరుమల రామచంద్ర

ప్రకాశకులు :

వెంకటరమణా పబ్లికేషన్స్

సుల్తాన్ బజార్ హైదరాబాదు

(ఆంధ్రప్రదేశ్)

# శశాంకవతి


రచయిత:

తిరుమల రామచంద్ర





ప్రకాశకులు:

వెంకటరమణ పబ్లికేషన్స్

సుల్తాన్ బజార్ :: హైదరాబాదు

(ఆంధ్రప్రదేశ్)

ప్రథమ ముద్రణ
1966

రెండవ ముద్రణ
1970





వెల :
రూ. 2-25

ముద్రణ :

ప్రగతి ఆర్ట్ ప్రింటర్సు,
రాజభవన్ రోడ్, హైదరాబాదు-4.

# మనవి మాట

క్షేమేంద్రుడను మహాకవి సంస్కృత భాషలో రచించిన బృహత్కథా మంజరియను గ్రంథములోని శశాంకవతీ లంబకము అను భాగమును అనుసరించి ఈ కథను రచించితిని.

కల్పనా కథలనిన పిన్నలును, పెద్దలును చెవికోసికొందురు. బృహత్కథ అనల్ప కల్పనలకు భాండాగారమని ప్రతీతి. దానిని బృహత్కథా మంజరిగా సంగ్రహించితినని క్షేమేంద్రుడు చెప్పికొనినాడు. పెక్కు ఉపాఖ్యాయికలతో నుండు ఈ కథ విద్యార్థులకు వినోదము కూర్చి, నీతిని బోధించి, కల్పనా శక్తిని పల్లవింప జేయునని విశ్వసించు చున్నాను.

పరాభవ
ఉగాది, 1966.

భాషా సేవకుడు,
గ్రంథకర్త.

# వృత్తాంతానుక్రమణిక



# 1

# స్వప్న వృత్తాంతము

కోసల దేశమున అయోధ్యయను నగరము కలదు. అది స్ఫటిక శిలానిర్మితములగు మహా గృహములతో ఒప్పారుచు కైలాసమును పరిహసించుచున్నట్లుండెను. అమరదత్తుడను రాజు దానిని పాలించుచుండెను. అతడు ప్రజారంజకుడని మిగుల కీర్తిబడసెను. అతనికి మృగాంకదత్తుడను కుమారుడుండెను. అతడు మహాసుందరుడు. ఆ కుమారునికి తనవలెనే సుందరులు, పరాక్రమశాలులు అయిన పదుగురు మంత్రులు స్థూలబాహువు, మేఘబలుడు, విక్రమకేసరి, వ్యాఘ్రసేనుడు, విమలబుద్ధి, దృఢముష్టి, గుణాకరుడు, చండశక్తి, చిత్రకథుడు, భీమపరాక్రముడు అనువారు. పది దిక్కులందును దేవమూర్తులున్నట్లు ఉండిరి. ఈ పదుగురు మంత్రికుమారులతోను మృగదత్తుడు దశరూపములతో శోభిల్లు ఏకాదశాత్మకుడగు రుద్రునివలె నుండెను.

ఇట్లుండగా, నొకనాడు భీమపరాక్రముడు మృగాంకదత్తునితో నిట్లనెను :— "దేవా" నిన్నరాత్రి నేనొక కలగంటిని. చాల విచిత్రమైనది కాటుకగుండ్లు దొర్లించినటు

చీకటి పిండుపిండుగా జగమును అలుము కొనినదట. అప్పుడా చీకటి తెరను తెల్లని గోళ్ళతో చీల్చుచు, అగ్నిశిఖవలె వ్రేలాడు నాలుకతో సింహ మొకటి నా మీదికి దుమికినది. నేను నా కత్తి దూసి దాని వెంట బడితిని. అది వేగముతో పరువెత్త సాగెను. నేనును దానిని దరుముకొని వెళ్ళితిని. అది తోకయెత్తి లంఘించుచు పోయెను. దారిలో ఒక నది అడ్డు తగిలెను. ఆ సింహ మా నదిని దాటి ఆవలి యొడ్డు చేరెను. నేను మిగుల ఒడుపున దాని విడువ నాలుకను పట్టుకొని తెగ నరికి, ఆ నదిని దాని సాయముతోడనే దాటి సింహమును సమీపించితిని. అంతలో ఆ మృగరాజు భయంకరమగు మానవరూపము దాల్చెను. నేను మిగుల వెరగుపడి, "నీ వెవడవు ?" అని ప్రశ్నించితిని. "నేను బేతాళుడను" అని ఆ రూపము సమాధాన మిచ్చెను. నేను చాల చురుకైన బుద్ధి కలవాడను గనుక వెంటనే, "మృగాంకదత్త కుమారునికి ఎవ్వతె భార్య యగునో చెప్పుము" అంటిని. బేతాళుడు ఇట్లు సమాధానమిచ్చెను :— "ఉజ్జయిని అను పట్టణమున్నది. దానికి కందర్పసేనుడను వాడు రాజు. అతడు కందర్పుని కన్నను సుందరుడు. అతనికి కళావతియను రాణియందు శశాంకవతి అను కన్యక జనించెను. ఆమె లోకోత్తర సుందరి : అయిన నామె మీ రాజుకు శత్రువుకుమారిత. అయినను, హరుని ప్రసాదము వలనే మీ రాజకుమారునికి భార్యయగును." ఈ మాటలు అన్ని బేతాళుడు మాయమైపోయెను."



మృగాంకదత్తుడు తన మిత్రుని స్వప్న వృత్తాంతము విని, తక్కిన మంత్రులనుగూడ పిలిపించి, వారికి ఈ విచిత్రమును తెలిపి ఇట్లనెను :— "భీమ పరాక్రముడేమో ఆశ్చర్యకరమగు కల కనెను. నేనును వింత స్వప్నము చూచితిని. వినుడు. నేను మీ రందరును వెంటరాగా వికటమగు అటవిని నడుచుచుంటిని. నాకు నాల దప్పిక అయ్యెను. ఎటు వెదకినను నీరు కానరాలేదు. తుదకెట్లో ఒక నది కనిపించెను. పరుగున పోయి, చల్లని నీరు త్రాగుటకు దోసిలితో ఎత్తగా, కత్తులు దూసికొని కొందరు వచ్చి, మనలను నీరు త్రాగకుడని నిషేధించిరి. మనమందరము క్రోధముతో వెఱ్ఱివార మయితిమి. ఇంతలో నది అదృశ్యమాయెను, దప్పికతో నా నాలుక పిడచబారి పోవుచుండెను. అప్పుడు నాకు శివుడు సాక్షాత్కరించెను. అతని మూడవ కంటి నుండి కన్నీటిబొట్లు భూమిపై పడి. సముద్ర రూపము దాల్చెను. నేను శర్వుని ఆజ్ఞతో రక్తాక్తమగు కపాలముతో ఆ నీరు త్రాగితిని. ఆ సముద్రమున చంద్ర ధవళమగు నొక ముత్యాల పేరు నాకు దొరకెను, నా మెడలో వ్రేలాడు ముత్యాలపేరు అదియే."

రాజకుమారుడు చెప్పిన స్వప్న వృత్తాంతమును మంత్రులందరును ఆకర్ణించి, స్వప్నము చాల శుభకరమనియు, ముమ్ముందు ఇష్టప్రాప్తిని, ఉత్తమ జయమును కలి

గించుననియు ప్రశంసించిరి. రాజకుమారుడు వారి మాటలకు మిగుల అలరి, మరల ఇట్లనెను :— "కందరపసేనుడు మహా బలవంతుడు, బహుసైన్యమున్నగాని అతనిని జయింపలేము. అతడు యుద్ధములం దారితేరినవాడు; దృఢమగు దుర్గముగలవాడు; అతని బొక్కసమును నిండుగానున్నది; మంత్రులేమో చాల భక్తివిశ్వాసములు గలవారు; మిగుల మేధావి. కనుక మనము యాచించినను కన్యను ఈయడు. అందువలన ఉపాయముతో సాధించదగు మార్గము నాలోచింపుడు. గుండెదిటవుగలవారు, విజయము సందేహాస్పదమయినప్పుడు, బుద్ధితో విజయము సాధింతురు. అన్ని పనులకును బుద్ధిబలము ముఖ్యము. అదియే అభ్యుదయమును కలిగించును.

## మంత్రగుప్తాఖ్యాయిక

"పూర్వము మగధ దేశమును భద్రబాహువను రాజు ఏలుచుండెను. వారాణసి రాజగు ధర్మగోపునకు అనంగలీల యను కూతురుండెను. భద్రబాహువు అనంగలీలను తనకిచ్చి పెండ్లి చేయుమని ధర్మగోపుని కోరెను. ధర్మగోపుడు తనవద్ద దిగ్గజతుల్యమగు భద్రదంతమను ఏనుగుండుటవలన పొగరించి. తనను ఎవరును జయింపలేరను విశ్వాసముతో భద్రబాహువు కోరికను నిరాకరించెను. భద్రబాహువునకు



మంత్రగుప్తుడను మహామాత్యుడుండెను. అతడు ఎట్లయినను రాజకార్యము సాధింపనెంచి యతిరూపధారియై కొందరు శిష్యులను వెంటబెట్టుకొని వారాణసికి వెళ్ళెను. అచట తానొక త్రికాలజ్ఞుడనని శిష్యులతో ప్రచారము చేయించుకొని జనులను ఆకర్షింప సాగెను. క్రమముగా నతడు కాశీరాజు గజపాలకుని వశపరచుకొనెను. ఆ గజపాలకుడు ఒకనాడు ఆ కపట సన్యాసిని తన యింట విందారగింప ఆహ్వానించెను. కపట సన్యాసి శిష్యసహితుడై అతని యింటికిబోయి భోజనము కావించెను. అందరును నిద్రించిన పిదప, అంతకుముందుగనే వెదురుగొట్టమున పట్టితెచ్చిన నల్లత్రాచును భద్రదంత గజము చెవిలో వదలెను. తర్వాత శిష్యసమేతుడై స్వదేశమునకు మరలిపోయి భద్రబాహువునకు జరిగిన సంగతులన్ను విన్నవించెను.

"ఇట వారాణసిలో భద్రదంత గజము నల్లత్రాచు చెవిలో జొరబడుటచే చీకాకుపడి ఘీంకరించుచు మరణించెను. ఆ వార్తను హస్తిపాలురు ధర్మగోప ప్రభువునకు దెలిపిరి. ప్రభువు చాల వ్యధపడెను. తనకు పెట్టని కోటగానున్న ఏనుగు కూలిపోవుటవలన ప్రభువు గర్వ మడగిపోయెను. ఆ సమయమున భద్రబాహువు తనకు అనంగలీలనిచ్చి పెండ్లి చేయవలెనని ధర్మగోపుని కడకు దూతను పంపెను. ధర్మ

గోపుడు ఏనుగు మరణించుట వలన దుర్బలుడై మగధ రాజుతో వైర మేలయని తలపోసి, తన కుమార్తెను భద్రబాహువునకు ఇచ్చెను. బుద్ధిమంతుల ప్రజ్ఞావిశేషమున అఖిల కార్యములును సిద్ధించుచున్నవి. పశువులకు వలె మూర్ఖులకు బుద్ధిలేని బలము నిరుపయోగము. మనముగూడ బుద్ధి బలముచే కార్యము సాధింప వలెను."

## వినయవత్యాఖ్యాయిక

మృగాంకదత్తుడిట్లు చెప్పగా, చిత్రకథుడను మంత్రి ఇట్లనెను. "దేవా. నీకు దైవానుగ్రహము పూర్ణముగా గలదు. దాని వలన సకల కార్యములును సిద్ధించును ఇందుల కొక గాథ చెప్పెదను వినుము :—

"సకల సంపదలకును ఆశ్రయమగు తక్షశిల యను నగరము కలదు. దానికి చంద్రాక్షుడనువాడు రాజుగనుండెను. అతడు ధర్మమే భూషణముగా గలవాడు; మనీషి. అతనికి అచలప్రభ యను భార్య యుండెను. అతడు సంతులేనందున, పుత్రకాముడై ఖడ్గమున లక్ష్మీదేవిని ఆవాహనము చేసి, ప్రతిదినమును నూట యెనిమిది తెల్ల దామర పూవులతో పూజించుచు హోమము చేయుచుండెను. ఒకమారు ఒక తెల్ల దామర కొరవడగా, వ్రతభంగము చేయనొల్లక అతడు తన హృదయ కమలమును కోసి అర్పింప



బోయెను. అతని భక్తికి మెచ్చి లక్ష్మీదేవి ప్రత్యక్షమై సకల భూపతి శేఖరు డగు తనయుడు కలుగునని వర మొసగి అంతర్ధాన మాయెను. పిదప నతనికి అచలప్రభ యందు ముద్దులు మూటగట్టు నొక కుమారుడు పుట్టెను. తెల్ల దామరలతో పూజించుట వలన కలిగిన వా డగుట వలన పుష్కరాక్షు డని అతనికి పేరు కలిగెను. రాజకుమారుడు పెద్దవాడయిన పిదప రాజు అతనికి రాజ్య మప్పగించి, తపోవనమునకు బోయెను. పుష్కరాక్షుడు న్యాయముగ రాజ్య పాలన మొనర్చుచు ఒకనాడు వేటకై అడవికి బోయెను. అడవిలో నొకచోట ఒక ఒంటె పాముల జంటను చంప బోవుచుండుట చూచెను. జంట యెడ కారుణ్య బుద్ధిగల అతడు వెంటనే వింట బాణ మెక్కుపెట్టి లొట్టియను కూల్చెను. ఆ లొట్టియ ఆ రూపమును వదలి విద్యాధర రూపమును ధరించి అతనితో నిట్లనెను :—

"రాజా, నీ అనుగ్రహమువలన శాపవిముక్తి బొందితిని. నీకు తగిన ప్రత్యుపకారము చేయుదును. నా మాట వినుము, పూర్వము అంశుమాలి యను విద్యాధరు డొకడుండెను. అతనిని తారావళి యను విద్యాధరి చంద్రుని రోహిణి వరించినట్లు వరించి వివాహమాడెను. దానికి అతని తండ్రి కోపించి, ఇద్దరికిని వియోగము కలుగుగాక యని శపించి

చెను. ఆ శాపబలమున తారావళి ప్రియుని కోలుపోయి అడవుల దిరుగుచు పశ్చిమ సముద్రమున కావల జంబూవనమున ఒక కుమార్తెను ప్రసవించెను. అది విజితాసు వను మహాముని ఆశ్రమము. ఆ విజితాసువు ఆ కుమార్తెను పెంచి పెద్దజేసి, వినయవతియని పేరిడెను. నేను ఒకమారు గగనమార్గమున బోవుచు, ఆ సుందరిని జూచి, అపహరింప బోయితిని. వినయవతి భయముతో కేకలు పెట్టెను. ఆ కేకలు విని విజితాసుముని సంభ్రమముతో వచ్చి "నీవు రూపముతో మదించియున్నావు. కనుక లొట్టియరూపము పొందుము" అని నన్ను శపించెను. నేను అతని పాదములపైబడి శాప విమోచన కాలము వేడితిని. 'పుష్కరాక్షు డను రాజు నిన్ను చంపును. అప్పుడు నీకు శాప విమోచనము గల్గును. అతడే ఈ వినయవతికి భర్తయగును పొమ్ము' అని ముని అనుగ్రహించెను. రాజా నీకు శుభమగు గాక!" అని చెప్పి అతడు ఆకాశ మార్గమున స్వనగరమున కరిగెను.

పుష్కరాక్షుడును తన పట్టణమునకు జని, మంత్రులకు రాజ్య మప్పగించి, గుఱ్ఱమెక్కి మునికుమారిక యగు వినయవతికై బయలువెడలి. గౌరీదేవి వరమువలన పశ్చిమ సముద్రము దాటి విజితాసువు తపోవనము చేరి, అతనికి నమస్కరించెను. ఆ మహాముని సకల వృత్తాంతమును తన యోగ దృష్టితో తెలిసి



కొని, ఇట్లనెను :– రాజా! నీవు ఎవరి కోసమిటకు వచ్చితివో ఆ ఈ వినయవతియను కన్య పూర్వము నీ భార్య. మన్మథుని విజయకేతనము వలెనున్న ఈ కన్యను స్వీకరింపుము. ఈమె నీకు పూర్వము భార్య యెట్లనెదవేమో! వినుము.

## విద్యుల్లేఖాఖ్యాయిక

"తామ్రలిప్తి నగరమున పూర్వము ధర్మసేనుడను వణిక్పుంగవుడు నివసించుచుండెను, అతని భార్య పేరు విద్యుల్లేఖ. దురదృష్టవశమున అతనిని దొంగలు కొట్టి దోచుకొనిరి. దానివలన నతడు దీర్ఘరోగియై బాధ భరింపలేక అగ్నిలో ప్రవేశించి ప్రాణములు వదలెను. అతని భార్యయు సహగమనము చేసెను. అగ్ని ప్రవేశ సమయమున వారిరువురును ఆకాశమున నెగసిపోవు హంసమిథునమును చూచుచు ప్రాణములు వదలుట వలన, మరణాంతరము హంసలై జన్మించిరి. దేహ జీవముల వియోగ సమయమున జ్ఞాన సంపత్తితో మనస్సు ఏ విషయమున లగ్నమగునో ఆ రూపమునే పొందునని పెద్దలు చెప్పుదురు.

"పిదప ఆ హంసముల జంట విచ్చిన తామర పూవులతో అలరారు సరోవరములలో తరగల ఉయ్యెలల మీద నూగుచు గడపెను, వర్షాకాలమునందును, గాలికాలము

నందును, ఆ జంట కష్టపడుచుండెను. ఈ విధముగ వాని కాలము విషామృతమయముగా గడుచుచుండెను.

"ఇట్లుండగా ఒకనాడొక వేటకాడు ఆ పరిసర ప్రాంతములలో పక్షుల కొరకు వలపన్ని మరుగున పొంచి యుండెను. హంసము ఆట దీరుగుచు ఆ వాగురలో చిక్కుకొనెను. హంసి దానిని విడిపింప నెంచి, సమీప నగరమునకు ఎగసి పోయి ఒకానొక రాజకుమారుని మణిహారమును ముక్కున గరచి కొని వచ్చి వేటకానికి కనబడునట్లు పడవేసెను. వేటకాడు రత్నహారముపై ఆశతో వలను వదలి రత్నహారము కడకు పోయెను. ఇంతలో హంసి ఒక ఉపాయము చేసెను. ఒక చెట్టు నీడను మాగన్నుతో పడియున్న మర్కటమును చూచెను. దానిని రెచ్చగొట్టిన నది వలను త్రెంచివేయునని తలపోసి, ఆ క్రోతి కన్నులపై చంచువుతో పొడిచెను. ఆ క్రోతి నిప్పంటుకొన్నట్లు కెవ్వున నరచుచు నిద్ర మేల్కొని వలలోని హంసను చూచి, అదియే తనను పొడిచినదని సందేహించి, వలను తుత్తునియలుగా త్రెంచి వేసెను. ఆ యదనున హంసము వలనుండి విడివడెను. హంసి మరల తన చెలికానిని కలసికొని మరొక తామర కొలనుకు పోయెను. వేటకాడది యంతయును చూచుచు రిచ్చపడి, హంసలు తప్పించుకొనినవను నిరాశతోను, రత్నహారము లభించినదను సంతోషముతోను మరలి పోయెను.



"హంసి మణిహారమును ముక్కున గరచుకొని వెళ్ళినదని రాచనగరున దాస దాసీజనము గోలపెట్టిరి. రాజ పురుషులు దాని జాడ నరయుచు వేటకాడున్న కడకు వచ్చిరి. వారిని చూడగనే వేటకాడు కాళ్ళు తడబడగా, అనుమానింప దగినట్లు ప్రవర్తించెను. రాజపురుషులు అతనిని బంధించి వెదకి మణిహారము గైకొని రాజ కుమారునికి అప్పగించిరి. వేటకానికి కారాగార ప్రాప్తి యయ్యెను. నిజమే! లోభము వలన ప్రాప్తము కూడ నశించును; ఆపదలును వాటిల్లును.

"మరొక మారు హంసము కమల పుష్పమును ముక్కున గరచికొని, హంసి వెంటరాగా అకాశ మార్గమున పోవుచుండెను. నిషాదు డొకడు ఆ హంసలను బాణముతో కూల్చెను. హంస ముక్కున నున్న తామర గంగాతీరమున కుండాద మహాముని పూజించుచున్న శివలింగముపై చత్రము వలె పడెను. ఆ నిషాదుడు హంసను మునికి అప్పగించెను. ముని హంసిని శివునికి నైవేద్యమిడెను. శివలింగముపై తామరను పడవేసిన పుణ్యముతో ఆ హంస మరు జన్మమున రాజుగా పుట్టెను. ఆ రాజవు నీవే. శివునకు నివేదనము పొందినందున ఆ హంసి విద్యాధరి యాయెను. ఇది ఈమె పూర్వ జన్మ గాథ. రాజా, ప్రాణులు తమ అంతిమ సమయమున ఏ భావముతో నుందురో, మరు జన్మమున ఆ రూపమును పొందుదురు."

విజితాసువు ఈ విధముగా పూర్వజన్మ వృత్తాంతమును వివరించి, వినయవతి తండ్రియగు అంశుమాలిని రావించి, ఆమెకును పుష్కరాక్షునకును వివాహము చేయించెను. వివాహ సమయమున అంశుమాలి తన యల్లునకు గగనగామి యగు నౌక రథమును అరణముగా నిచ్చెను. పుష్కరాక్షుడు పెద్దల కడ సెలవుపొంది పెండ్లికూతురితో పాటు ఆ రథమెక్కి తన పట్టణమునకు వెళ్ళిపోయి రాజ్యమేలుచు సుఖముననుండెను.

"దేవా, ఇట్లు దేవతలు పుణ్యవంతుల అభీప్సితములను పూరించుట వినుచున్నాను. నీకును శర్వుడు సర్వాభీష్టములను కలిగించును."

చిత్రకథుడిట్లు చెప్పగా మృగాంకదత్తుడు విని మిగుల నాశ్చర్యపడి, శశాంకవతిని దలచికొనుచు, ఉజ్జయినికి పయనమగుటకు సన్నాహము చేయదొడగెను.

—०ಂ०—

# 2

# ఉజ్జయినీ ప్రయాణ వృత్తాంతము

—०ಂ०—

మృగాంకదత్తుడు తన పదుగురు మంత్రులను పిలిపించి ఉజ్జయినికి ఎట్లు చేరవలెననుటను గురించి మంతనము జరిపెను. మహావ్రతిక వేషమున రహస్యముగా వెళ్లుట మేలని యందరును కలియబలుకుకొనిరి. మహావ్రతిక వేషమునకు గావలసిన ఎముకలు, కేశములు, మంచపుకోడు, కపాలము మొదలగు పరికరములను భీమపరాక్రముడు ఎవరికిని తెలియకుండ తన యింట సమకూర్చెను. ఈ వృత్తాంతమంతయును వేగులవారి వలన పెద్ద రాజగు అమరదత్తుని మహామంత్రియగు వినయవంతుడు తెలిసికొని యుండెను.

ఇట్లుండగా. ఒకనాడు మృగాంకదత్తుడు తన మేడ మీద తాంబూల చర్వణము చేయుచు నడచుచుండి తాంబూలపు తమ్మను క్రిందికి ఉమిసెను. అప్పుడా దారిని మహామంత్రి వినయవంతుడు పోవుచుండెను. ఆ తమ్మ అతనిపై పడెను. మహామంత్రి తలయెత్తి చూచి ఉమిసినవాడు మృగాంకదత్తుడని గ్రహించి, కోపోద్దీపితుడై, ఎట్లయినను ప్రతిక్రియ చేయవలెనని పగబూనెను. అప్పుడు రాజు అమరదత్తుడు విషూచి వ్యాధితో బాధపడుచుండెను. వినయ

వంతుడు రాజకుమారునిపై పగ తీర్చుకొనుటకు ఇదియే సమయమని రాజు చెవిలో నిట్లు విన్నవించెను : "మహారాజా, నీ కుమారుడు నీ ఆయుఃక్షయమునకై భీమపరాక్రముని యింట అభిచారహోమము చేయుచున్నాడు. దాని వలననే నీకీ వ్యాధి కలిగినది."

ఆ మాటలు విని రాజు వాని నిజ మరయగోరి తన సేనాపతిని భీమపరాక్రముని యింటికి బంపెను. సేనాపతి భీమపరాక్రముడు మృగాంకదత్తుని మహావ్రతిక వేషమునకై సమకూర్చి యుంచిన కేశపాలాదులను కొనివచ్చి రాజు నెదుట నుంచెను. వానిని జూచి రాజు మిగుల క్రోధార్తుడాయెను. "రాజ్యలోభమున తండ్రికే ద్రోహము తలపెట్టిన వాడు ఇక నా రాజ్యమున నుండ నర్హుడు కాడు." అని తలపోసి, పదుగురు మంత్రులతో గూడ తన కుమారుని అయోధ్య నుండి వెడల గొట్టించెను.

మృగాంకదత్తుడు నగరము వదలి పోవుటకు కష్టపడలేదు. తలిదండ్రులకు నమస్కరించి తండ్రి ఆనతి మేరకు తన పదుగురు మంత్రులతోను సంతోషముతో బయలుదేరెను. కొంత దూరము పోయిన పిదప నతడు తన మంత్రులతో నిట్లనెను :— "శక్తిరక్షితుడను కిరాతరాజు కలడు, అతడు నాకు చిన్ననాటి మిత్రుడు. అతనిని కిరాతులకు మహీపతిని



చేసినవారు మా తండ్రియే. మనము అతని నగరమునకు పోయి, కొన్నాళ్లు విశ్రమించి, ఒక కట్టుబాటు చేసికొని శశాంకవతిని వెదకుటకు దక్షిణ దిక్కుగా బయలుదేరుదము." రాజకుమారుని మాటలకు మంత్రికుమారులందరును అంగీకరించిరి. పిదప నందరును కిరాతరాజు నగరమునకు బయలుదేరిరి, దారిలో నొక మహారణ్యమున బ్రవేశించిరి. ఇంతలో కుందేటి రక్తపు మడుగువలె నెఱ్ఱనయి ఆకాశమను నల్లత్రాచు ఫణారత్నమువలె వెలుగొందు సూర్యుడు అస్తాద్రి చేరెను. రాత్రి యను బేతాళుడు ఆవహించినట్లు దిగంతములందు చీకటి వ్యాపించెను. మృగాంకదత్తుడు నడచి నడచి అలసి యున్నందున చెదపట్టి యెండిపోయిన యొక చెట్టుక్రింద మిత్రులతోపాటు పరుండి నిద్రించెను.

అర్ధరాత్రిలో వారందరికి మెలకువయాయెను. ఆకాశము నిర్మలముగ నుండెను. శర్వాణి కర్ణావతంసమైన మొగిలి రేకువంటి తుహిన రేఖ వెలుగు మీదికి వచ్చి వెన్నెల కాయుచుండెను. వారు చూచుచుండగనే, ఆ మ్రోడు రెమ్మలు వేసి, కొమ్మలు వ్యాపించి పూవులతో నవ్వుచున్నట్లు కనిపించెను. ఇంతలో మదురిమాగిన పండ్లతో వంగిపోయెను. ఆ పండ్లు వెన్వెంటనే భూమిపై పడెను. అది చూచి వారందరును ఆశ్చర్యపడి, ఆ పండ్లను తిని ఆకలి తీర్చుకొనిరి. ఇంతలో

ఆ ఫలవృక్షము బ్రాహ్మణ కుమారుడాయెను. చంద్రుని కిరణములవంటి జందెము ఆతని మెడలో మెరసిపోవుచుండెను. వారందరును కుతూహలముతో నతని వృత్తాంతమడిగిరి. అతడిట్లు చెప్పదొడగెను :—

## శ్రుతధ్యాఖ్యాయిక

"పూర్వము అయోధ్యానగరమున దమధి యను విప్రుడుండెను. నేను ఆ మనీషి పుత్రుడను. నా పేరు శ్రుతధి. ఒకప్పుడు కరవు వచ్చెను. ఆ కరవులో మా తల్లి తన భోజనమును క్షుధార్తుడగు నొక అతిథికిచ్చి, తాను ఆకలితో జీవితము వదలెను. పిదప మా తండ్రియు నేనును ఆకలితో మతి చలించిన వారివలె తిరుగుచు ఇటకు వచ్చితిమి. ఎవరో పుణ్యవంతుడు మా తండ్రికి ఐదు పండ్లిచ్చెను. మా తండ్రి నాకు మూడని, తనకు రెండని అనుకొని స్నానమునకై సరోవరమునకు పోయి నీటిలో మునిగి జపము చేయుచుండెను. నేను అతడు తిరిగి వచ్చునంతలో ఐదు పండ్లను తిని కొయ్యవలె పడియుంటిని. అతడు స్నానమై వచ్చి, నా కపటము నెరిగి, నన్ను ఈ సరోవర తీరమున పిండుచెట్టునై యుండునట్లు శపించెను. నేను రోదించుచు అతని కాళ్ళపై పడి శాపాంతమును వేడితిని. వెన్నెల రాత్రులలో నీవు పూచి ఫలింతువు. నీ పండ్లను పాంథులెవరైన తినిననాడు నీకు



శాపవిమోచనము కలుగును." అని చెప్పెను. పెద్దకాలమునకు, ఇప్పుడు మీరు నా ఫలములను ఆరగింపగా నేను శాపవిముక్తుడనైతిని."

వారు శ్రుతధిమాటలు విని, తమ వృత్తాంతమును అతనికి తెలిపిరి. తననుగూడ అనుచర బృందమున జేర్చుకొనవలెనని శ్రుతధి మృగాంకదత్తుని కోరగా, నతడు అందులకీయకొనెను. ఆ రాత్రి వారందరును అటనే గడపి, మరునాడు దక్షిణాభిముఖముగా బయలుదేరిరి; దారిలో కరిమండితకమను మహారణ్యమును దాటి, కిరాతరాజు నగరమును చేరిరి. కిరాతరాజగు శక్తిరక్షితుడు మృగాంకదత్తుని రాకకు మిగుల సంతోషించి, కడు గౌరవముతో తన నగరుకు గొనిపోయి, సకలోపచారములు ఒనర్చెను. మృగాంకదత్తుడు తన మిత్రులతో గూడ నట గొన్నాళ్ళు విశ్రమించి, మరల ఉజ్జయినికి బయలుదేరెను. దారిలో నొక మహాటవియందు వృద్ధుడగు నొక తాపసుడు కనిపించెను. మృగాంకదత్తుడు మిత్రసహితముగా నతనికి నమస్కరించి, "స్వామీ ఈ నిర్జనారణ్యమున తమరు ఏకాకియై ఏలయున్నారు." అని ప్రశ్నించెను. తాపసు డిట్లుచెప్పెను:—.

"పూర్వము శుద్ధకీర్తియను ఋషి యుండెను. నేనాతని శిష్యుడను. వివిధ మంత్రౌషధులలో సిద్ధిగలవాడను,

నేను దేశాటనము చేయుచుండగా నొక రాజకుమారుడు కనిపించెను. అతడు విధి నిధానములను ఎరిగినవాడు. అతడు నాకు సకల విషయములను తెలిపి "వింధ్యారణ్యమున నొక గొప్ప నాగరాజు భవనమున్నది. ఆ భవనము పైకి కనిపింపదు. గడ్డి గాదము కప్పిన ట్లుండును. ఒక హంసల జంట విహరించుచుండును. దానినిబట్టి యది నాగరాజు భవనమని ఎరుంగునది: ఆ నాగరాజు పేరు పారావతుడు అతనియొద్ద దివ్యకాంతులతో మిరుమిట్లుగొలుపు ఖడ్గమున్నది. దాని పేరు వైడూర్యకాంతి. ఆ ఖడ్గమును సాధించినవాడు సిద్ధాధిపత్యముపొంది సుఖముగా నుండును. అని చెప్పెను. ఆ మాటలు విని నేను బయలుదేరి వచ్చితిని. ఆ సిద్ధి సంపాదించుటకయి సహాయులు ఎవరును లేరుగదాయని యాలోచించి, తుదకు చేయునది ఏమియును లేక మరణించుటకు ఉద్యమించితిని." అనెను. మృగాంకదత్తుడు ఆ తపసి మాటలువిని, "భగవన్, నేను నా మంత్రులుగూడ నీకు సహాయులుగా నుందుము" అని విన్నవించెను

## నాగ శాపాఖ్యాయిక

ఆ మాటలకు తాపసుడు సంతసించి, వారందరికిని పాదలేపము నిచ్చెను. వారందరును ఆ లేపమును అడుగులకు రాచుకొని, దాని మహిమచే ఆకాశమార్గమున క్షణ



ములో వింధ్యారణ్యముచేరిరి. తాపసుడు క్షత్రియ కుమారుడు చెప్పిన గుర్తులనుబట్టి నాగరాజు భవనమున్న ప్రాంతమును కనుగొని, చంద్రకొయ్య మేకులను అభిమంత్రించి, ఎనిమిది దిక్కులందున్ను నాటి, దిక్పాలకులనుగా మృగాంకదత్తుని, అతని మంత్రులను నిలిపి, శింశుపా వృక్షమునీడను అగ్నిని స్థాపించి, నాగదమన మంత్రముతో హోమముచేయ నారంభించెను. అప్పుడు ఆ శింశుపా వృక్షమునుండి ఒక దివ్యాంగన వెలువడి, సవిలాసముగ అతనియొద్దకునడచి వచ్చి అతనిని స్పృశించెను ఆ స్పర్శమునకు తాపసుడు మనస్సు కలంగి, చేతులువణకగా, చేతనున్న హవిర్భాండమును క్రిందపడవేసెను. ఆ సమయముచూచి, పారావతనాగరాజు భవనమునుండి పిడుగులు గ్రక్కు ప్రళయకాల మేఘమువలె గర్జించుచు తన ఫణామండలముచే దిక్కులను కప్పుచు పైకి వచ్చెను అతనిని చూచినంతనే తాపసుడు మరణించెను. మృగాంకదత్తుడు మొదలగువారు తమ కత్తులు ఒరనుండి దూసి నాగరాజుపైకి ఉరికిరి. నాగరాజు వారిని చూచి, "విఘ్నయోషిత్తువలన మీ గురువు మరణించెను. మీరందరును అతని మాటవిని నిష్కారణముగా నాపై ద్వేషము బూనితిరి. కనుక మీకు ఈ అరణ్యమున వెంటనే పరస్పర వియోగము కలుగుగాక!" అని శపించెను. ఆ శాప బలమున

వారందరును కన్నులు చీకట్లుక్రమ్మ, మనసు సంభ్రమించి, విడిపోయిరి.

## విమల బుద్ధ్యాఖ్యాయిక

మృగాంకదత్తుడు శోకార్తుడై ఒంటరిగా తిరుగసాగెను. కొంతకాలమునకు అతనిని శ్రుతధి కలసికొనెను. శ్రుతధి అతనిని ఎప్పటికైనను మిత్రులన్ను కలసికొనకపోమని యూరడించెను. వారిరువురును ఉజ్జయినికి బయలుదేరిరి. కొన్నాళ్ళకు దారిలో విమలబుద్ధి కనిపించెను. అతడు ఆనందబాష్పములు కన్నులనుండి కురియగా, మృగాంకదత్తుని గాఢముగా కౌగలించుకొని, హర్షశోకములు ముప్పిరిగొనగా పెద్దగా నిట్టూర్చి యిట్లనియెను :—

"దేవా, వింధ్యాటవిలో నాగరాజు శాపమున నీ నుండి విడిపోయి ఎచ్చటనోపడి, వెఱ్ఱివానివలె తిరుగ సాగితిని. అట్లు తిరుగుచు, తేజోరాశియగు బ్రహ్మదండియను మహాముని ఆశ్రమము చేరితిని. అచ్చట ఆ ఋషి నన్ను ఆదరముతో చూచెను. నేను ఆశ్రమమున ఇటునటు నడయాడుచు సమీపమున నున్న యొక గుహవద్దకు పోయితిని. లోపల నేమున్నదో యను కుతూహలముతో గుహలో ప్రవేశించితిని. అక్కడి దృశ్యముచూచి ఆశ్చర్యము కలిగెను. ఒక్క లలన ఒక కుమ్మరిసారెను త్రిప్పుచుండెను. దాని చుట్టును



తేనెటీగలు ముసిరికొని ఝుంకారము చేయుచుండెను. ఒకచోట ఒక ఎద్దును, ఒక గాడిదయును నిలిచి యుండెను. ఎద్దు తెల్లటి నురగను, గాడిద ఎఱ్ఱని నురగను క్రక్కుచుండినవి. తేనెటీగలు కొన్ని ఎద్దునోటి తెల్లని నురగను త్రాగి నల్లనై పోయెను. గాడిదనోటి ఎఱ్ఱని నురగను త్రావిన తేనెటీగలు తెల్లని వాయెను. అవి నల్లని, తెల్లని మలములు వదలెను, వానినుండి సాలెపురుగులు బయలువెడలి గూండ్లు అల్లసాగెను, ఆ తేనెటీగలు ఆ సాలెగూండ్లలోనే తగులుకొన్నవి. అటనే మరియొక చోట విషలతయు, సింధువారలతయు (వావిలి తీగయు) నుద్భవించినవి. కొన్ని తేంట్లు విషలతపె వాలి, మంటలతో నేడువ సాగినవి. ఆ ఏడుపు విని సింధువారలతపై వాలిన తేంట్లును ఏడువ సాగినవి. ఆ ఏడుపుల గోల విని ఒక ముని కనికరించి, తన లలాటమునుండి పుట్టిన మంటలు ప్రసరింపజేసి తేంట్ల బంధనములను కాల్చివేసెను. ఆ తేంట్లు, సాలెపురుగులు ఒక వెదురు గొట్టములో దూరి ఛత్రమువలె వ్యాపించిన తేజోమండలమున చేరిపోయినవి.

"ఈ కౌతుకము చూచి, ఆశ్చర్యపడుచు, ఆశ్రమమునందే తిరుగుచుండగా, మరియొక వినోదము కనిపించెను. మదించిన ఏనుగులను చంపిన సింహమొకటి కనిపించెను. ఆ సింహమునకు పది బాహ్వువు లుండెను. దాని వెంట పెక్కు సింహములు నడుచుచుండెను, ఇంతలో పెంటిసింగము సవ్వడి విని

పించెను. లంబోదరుడొకడు ఆ సింహమును సింహి యొద్దకు నడిపించుకొని వెళ్ళెను.

"ఈ రెండు విచిత్రములను చూచి మిగుల నక్కజపడి బ్రహ్మదండ మునివరుని యొద్దకు వెళ్ళి, విన్నవించితిని. జ్ఞాన లోచనుడగు ఆ ముని ఇట్లనెను: "కుమారా, తిరుగుచున్న కుమ్మరిసారె సంసార చక్రము. దానిమీద వాలిన తేనెటీగలు ఆశలతో కొట్టుమిట్టాడు మానవులు. ఆ చక్రము త్రిప్పు చున్న స్త్రీ మహామాయ. ఎద్దు గాడిద ధర్మాధర్మములు. విషము నరక దుఃఖము. సింధువారము సురాలయము. ఆ ముని మహేశ్వరుడు. అతడు వానిని పాపము లడంచి కాపా డెను. అవి వెదురు గొట్టమను బ్రహ్మరంధ్రమునుండి తేజో మయ లోకము చేరినవి. నీవు చూచిన దశ బాహువుల సింహము సంగతియును వినుము. ఆ సింహము మృగాంక దత్తుడు. దాని పది బాహువులు పదుగురు మంత్రులు. ఆ బొజ్జకడుపు మానిసి లంబోదరుడగు వినాయకుడు. అతని దయవలన మృగాంకదత్తుడు శశాంకవతిని వివాహమాడ గలడు."

"దేవా. మహాముని మాటలతో నా దిగులు తీరెను. అటనుండి సంతోషముతో నేను బయలుదేరి, నిన్ను అన్వేషిం



చుచు ఇట నిన్ను కలిసికొన గలిగితిని. ఇక మనకు శివుడే ప్రమాణము."

విమలబుద్ధి ఈ రీతిగా చెప్పగా, మృగాంకదత్తుడు విని ఆశ్చర్యపడెను. అతని మాటలకు సంతోషము కలిగినను తక్కిన మంత్రుల గతి యేమాయెనో యను చింతతో కుందుచు ఉజ్జయినికి బయలు వెడలెను.

# 3

# మాయావటు వృత్తాంతము

—๑০৩০—

పిదప మృగాంకదత్తుడు శ్రుతధి, విమలబుద్ధి వెంటరాగా, ఉజ్జయినికి పోవుచు, నర్మదానదిని చేరెను. నర్మదానది నురగలతో నవ్వుచున్నట్లు, పక్షుల కలకలారావముతో తనకు స్వాగతము చెప్పుచున్నట్లును అతనికి తోచెను. అతడు గట్టు చేరిచూడగా ఒక శబరుడు స్నానముచేయుచుండెను. అతనిని ఏనుగులవంటి మహాగ్రాహములు పట్టి లాగుచుండెను. మృగాంక దత్తుడు తన కత్తిని ఒరనుండి తత్ క్షణమే దూసి, నీటిలో దిగి ఆ మొసళ్ళను ముక్కలు ముక్కలుగా నరికి ఆ శబరుని రక్షించెను.

## శబరరాజాఖ్యాయిక

ఆ శబరుడు నీటినుండి వెలువడి మృగాంకదత్తునికి నమస్కరించి, "మహానుభావా నీవెవరవు? నా ప్రాణములను గాపాడుటకే వచ్చినట్లు తోచెడిని. నేనిక్కడి శబరరాజును. నాపేరు మాయావటుడు." అని విన్నవించెను. శ్రుతధి రాజకుమారుని వృత్తాంతమును, తమసంగతియును మాయావటునకు తెలిపెను. మాయావటుడు వారిని తన పల్లెకు పిలుచు



కొనిపోయి, రాజోపచారములతో సత్కరించెను; దుర్గపిశాచుడు మొదలగు తనమిత్రులను వారి పరిచర్యకు నియమించెను. రాజకుమారుడును అతని యుపచర్యకు మిగుల సంతుష్టుడై కొంత కాలమా పల్లెలో విశ్రమించెను.

ఇట్లుండగా, వానాకాలమువచ్చెను. మేఘములు గర్జింపదొడగెను. కొండకోనలలోని నెమళ్ళు మత్తెక్కి నాట్యమాడసాగెను. మాయావటుడు మృగాంకదత్తునితో జూదమాడుచు, ఆ మనోజ్ఞదృశ్యముచూచి యానందించుచుండగా, మాయావటుని ప్రతీహారుడు చండకేతువనువాడు "దేవా, ఈ నెమళ్లకేమి? నాయింట నొక నెమలియున్నది. వానకాలమనక, ఎండకాలమనక సదా సర్వకాలమునను అది సూర్యుడస్తమించగనే నాట్యమారంభించును." అనెను. మాయావటువు ఆమాటలు విని "అట్లయిన రేపు దానిని నాకు చూపుము" అని ఆనతిచ్చి వెడలెను. మృగాంకదత్తుడు తన విడిదికి బోయెను.

చండకేతువు మనసులోని మాట వేరు. అతడు తనరాజగు మాయావటుని చంపి, అతని రాజ్యమపహరింప జూచుచుండెను. మృగాంకదత్తునివంటి వీరుడు మాయావటునకు చెలికాడు కావుటవలన తన పనులు కొనసాగవని అతడు గ్రహించి, వారిద్దరిని మాయోపాయములచే చంప

నెంచి మంచిమాటలచే వారిని నమ్మింపజూచుచుండెను. అతని కుట్రకు మాయావటుని రాణి మంజుమతిక సహాయము కూడ గలదు.

సూర్యుడస్తమించెను. నెమళ్ళు పురులువిప్పి పల్లెను కప్పినట్లును, ఏనుగుల చర్మముతో ఆకాశమును ఆచ్ఛాదించినట్లును, శబర వనితల నల్లనికురుల కాంతులు దిక్కులలో వ్యాపించినట్లును చీకట్లు క్రమ్మెను. మృగాంకదత్తుడు మారు వేషము వేసికొని ఖడ్గపాణియై తన విడిదినుండి వినోదార్థము బయలు వెడలెను. ఆ చీకటిలో తనకన్నముందుగ మరియొక వ్యక్తి పోవుచున్నట్లతనికితోచి, వెన్నాడెను. ఆ వ్యక్తి మాయావటుని అంతఃపురము చేరెను. అట దీపకాంతిలో నతనిముఖము స్పష్టముగా నగపడగా, మృగాంకదత్తుడు ఆశ్చర్యపడెను. అతడు చండకేతువు! మృగాంకదత్తుడు చీకటిలో నొక మూల నక్కి వానిచర్యలు చూచుచుండెను. శబరరాజు భార్య మంజుమతికయును, చండకేతువును వాదులాడుచుండుట వినబడెను. "ఎట్లైనను మాయావటుని, మృగాంకదత్తుని నేడు పరిమార్చెదను" అను మాటలు వినబడెను. మృగాంకదత్తుడా మాటలు వినియు భయపడక అతని వృత్తాంతమును ఇంకను పరిశీలింపదలచి యచటనే వేచియుండెను. కొంత సేపటికి చండకేతువు వెలుపలికివచ్చి



చీకటిలో మరల నెచటికో నడువసాగెను. మృగాంకదత్తుడును అతని వెన్నంటెను. చండకేతువు ఒక భవనముముందు ఆగి వెనుదిరిగి చూచెను. మారు వేసముననున్న మృగాంకదత్తుడు కనుపించెను. అతడెవడో వేగులవాడయియుండునని, తన సంగతి కనిపెట్టియుండుననియు చండకేతునకు సందేహము కలిగెను. అయినను, తన మనసులోనిమాట వెలుపలికి పొక్కనీయక "ఎవడవు నీవు?" అని ప్రశ్నించెను. మృగాంకదత్తుడు వినయముతో "నేనొక వీరుడను. పరదేశమేగుచుంటిని. ఈ రాత్రి ఆశ్రయమిందు" అనెను. దుష్టుడగు ప్రతీహారుడు తనయింట నతనిని రహస్యముగ మడియింపవచ్చునని ద్రోహచింతతో పైకి ఆదరముచూపుచు తన సేవకునొకనిని బిలిచి మృగాంకదత్తునికి తన క్రీడామయూరముగల మందిరమున పడక సమర్చుమని ఆనతిచ్చెను. వాడు అట్లేచేసి, ఆ మందిరమున దీపము వెలిగించి వెలుపలికివచ్చి, మృగాంకదత్తుడు మందిరమున ప్రవేశించినపిదప తలుపుమూసి గొళ్ళెము వేసి పోయెను.

మృగాంకదత్తుడు శయ్యపై కూర్చుండగా, ఎదుట నొక పంజరము నెమలి యగపడెను. చండకేతువు చెప్పిన సదానర్తనశీలమైన నెమలి యిదియే కావచ్చునని మృగాంకదత్తుడు భావించి, పంజరము తలుపు తెరచెను. నెమలి వెలు

పలికి వచ్చి, మృగాంకదత్తుని కాళ్ళపైబడి ఏడ్చునట్లు రొద చేయసాగెను. మృగాంకదత్తుడు దాని బాధకు కారణము దాని మెడను బిగించికట్టిన తాడయియుండునని తలపోసి, దానిని విప్పివేసెను. ఆ కంఠసూత్రము పోగానే ఆ నెమిలి భీమ పరాక్రముడయి మృగాంకదత్తునికి నమస్కరించెను. మృగాంకదత్తుడు ఆశ్చర్యపడి, అతనిని బిగియార కౌగలించుకొని, "సఖుడా, సంతోషామృత సముద్రమున గ్రుంకులిడినట్లయినది. ఏమి ఈ వింత! అంతయును స్పష్టముగా చెప్పుము. నేను అప్పటి మృగాంకదత్తుడనే." అనెను. భీమపరాక్రముడు మిక్కిలి ఆనందించి తన వృత్తాంతమిట్లు చెప్పదొడగెను :—

## భీమపరాక్రమాఖ్యాయిక

"దేవా, నా వృత్తాంతము వినుము. నేను అప్పుడు నాగరాజు శాపముచే మిమ్ములను వదలి చెదరిపోయి ఒక అడవిలో తిరుగ దొడగితిని. ఆ అడవిలో దావాగ్ని రగులుకొనినది. వరాహములు, మహిషములు, హరిణములు మొదలగు మృగములును, పక్షులును ప్రాణభీతిచే అరువసాగినవి. చెట్లు, తీగలు మంటలు క్రమ్మి కమలిపోదొడగినవి. నీరనునదిలేక మృగతృష్ణ ఏర్పడినది. ఎట్లో ఆ మంటల నుండి తప్పించుకొని అలసి సొలసి ఒక బూరుగుమ్రాకును



గని దాని క్రింద విశ్రమించి, ఛీ ఏమి బ్రతుకు ఇది యనుకొని ప్రాణ త్యాగమునకు ఉద్యమించితిని. అప్పుడు ఒక ముసలి బాటసారి యొకడు తారసిల్లెను. అతడు నన్ను చూచి, "వత్స, ఏల నీ ముఖ మిట్లు వాడినది? ఎందులకు పరితపించుచున్నావు? ఈ సంసార దుఃఖసరణి దుఃఖపడుటవలన గడువదు అనుభవింపక తప్పదు." అని ప్రేమతో నుడువగా, నా వృత్తాంత మతనికి చెప్పితిని ఆ వృద్ధపాంథుడు నా మాటల విని, "కుమారా, నీవు వీరుడవు వీరుల మనసును శోకము తాకదు. నీ మిత్రులు బ్రతికియుండిన యెడల తప్పక మీరందరును మరల కలసికొందురు. ధైర్యము నవలంబింపుము. ధైర్యమే విపత్సముద్రపు గట్టును చేర్చగల సేతువు ఇందులకు ఒక కథ చెప్పెదను వినుము" అని ఒక కథ చెప్పదొడగెను.

## హంసావళ్యాఖ్యాయిక

"కోసల దేశమున విమలాకరుడను రాజుండెను. అతనికి కమలాకరుడను కుమారుడుండెను. అతడు రాజ్యలక్ష్మీ విలాసమణి దర్పణమువలె, రూపుదాల్చిన అనంగునివలె నుండెను, ఒకనాడు మనోరథసిద్ధియను నొక వందిమాగధుడు అతని కొలువునకు వచ్చి ఒక గాథను పాడెను. ఆ గాథ యిది :—

"కువలయ భూషణు నమలుని
గుణనిలయుని కవిసహస్ర నిర్ఘృష్టున్.
హంసావళి యెటసుఖించున్
కాంతున్ కమలాకరున్ వదలి ,"

మనోరథసిద్ధి గూఢతాత్పర్యముతో పాడిన ఈ గాథను కమలాకరుడు విని కుతూహలముతో నేకాంతమున దీని భావమేమి యని ప్రశ్నించెను. అతడిట్లు చెప్పెను.

"దేవా, విదిశ యను ప్రఖ్యాతమగు నగరి యున్నది. అది లక్ష్మికి ఆటపట్టు. దానికి మేఘమాలి యనువాడు రాజు. అతనికి హంసపాళి యను కుమార్తె కలదు. నేను దేశము ద్రిమ్మరుచు విదిశానగారమునకు బోయి, ఆచ్చట దర్దురుడను నాట్యాచార్యుని యింట నుంటిని. అట్లుండగా రాజకుమారి తన తండ్రి పేరోలగమున నాట్యమాడునని నగరమున వదంతి వ్యాపించెను. నేనును నాట్యాచార్యుని యింట నున్నందున అతనితోపాటు రాచనగరులోని నాట్యమండలము చేరితిని. అచట వీణామృదంగాది వాద్యములు మ్రోగగా, ధ్రువగీతిగానము ప్రవర్తిల్లగా, హంసావళి రంగస్థలమున ప్రవేశించి, సవిలాసముగ కుసుమాంజలిని సదస్యుల మ్రోల వెదజల్లి నాట్యాది దేవతలవలె నాట్యమాడి తండ్రికిని, అమాత్యాదులకును, ఆశ్చర్యము కలిగ్గించెను.



ఆమె ముఖమప్పుడు నాందీగీతమును విని వచ్చిన సాక్షి చ్ఛంద్రునివలె నుండెను. ఇంతలో సాయంకాల మాయెను. రాజు తన కుమార్తై దర్శనముతో అలరి కొలువు చాలించి నగరునకు బయలుదేరెను. నేనును నాట్యాచార్యునితో నింటికి తిరిగి వచ్చి "ఈ మృగలోచన కమలాకర దేవునికి తగినది" అని తలపోసి, నాట్యాచార్యుడగు దర్దురుని తోడ్పాడుతో రాజనగరులో ప్రవేశించి, కన్యాంతఃపుర చిత్రములలో నీ చిత్రము నొకదానిని చిత్రించి దాని క్రింద నీ పేరు వ్రాసి వచ్చితిని. రాజకుమారి ఆ చిత్రమును చూచి మిగుల సంతోషించినదని పిదప తెలిసికొంటిని. భరతాచార్యుడగు దర్దురకుడును వెఱ్ఱివానివలె వేషము వేసికొని, నీ గుణగణములను బాడుచు ఎగురుచు రాజకుమారికి నిరంతరము నీ ధ్యానమే కలుగునట్లు చేసెను. ఇట్లామె నీ చింతతో పాడ్యమినాటి చంద్రరేఖవలె చిక్కిపోయియుండెను. ఒకనాడామె తలిదండ్రుల యనుజ్ఞతో దేవదర్శనమునకై విష్ణు మందిరమునకు వచ్చెను. ఆ సంగతిని దర్దురుని వలన మొదటనే తెలిసికొన్న నేనును విష్ణుమందిరమునకు బోయి, ఆమె చెవిలో పడునట్లు "కమలాకరల్లలితములగు చరణములచే విశ్వమును కొలిచినవాడా విశ్వాత్మా నీకు జయమగుగాక।" యని శ్లేషగర్భితముగా దైవస్తుతి యొనర్చితిని. ఆ స్తుతిని విని ఆమె నన్ను దగ్గరికి పిలిపించి పల్మా తడవలు ఆ స్తుతి పఠింపుమని కోరి, జంట చీనాంబర

ములు నాకు బహుమతి యిచ్చి, ఒక చీనాంబరము చెరగున రక్త చందనముతో నీ గాథను వ్రాసెను :—

"కువలయభూషణు నమలుని
గుణనిలయుని కవిసహస్ర నిర్ఘుష్టున్,
హంసావళి యెట సుఖించున్
కాంతున్ కమలాకరున్ వదలి."
"దేవా, ఇదిగో చూడుము."

రాజకుమారుడు ఆ మాటలు విని, ఆమె రూపము కన్నులలోను, మనసులోను నాట్యమాడగ, ఎట్లైనను ఆమెను వివాహమాడ నిశ్చయించి, ఆమె యొద్దకు పోవు నుపాయ మాలోచించుచుండెను. ఆ సమయమునకు దైవానుగ్రహమున అతని తండ్రి అతనిని పిలువనంపి దిగ్విజయయాత్రకు బయలు వెడలి శత్రువగు అంగరాజును గెలువుమని ఆదేశించెను.

కమలాకరుడు తలవని తలంపుగ హంసావళి అన్వేషణమును కలసి వచ్చినందుకు మిగుల సంతోషించి, పెద్ద సైన్యముచే జైత్రయాత్రకు బయలుదేరెను. కమలాకరుని తురంగదళముల గిట్టలతో పైకెగసిన దూళి దిగంతములకు వ్యాపించి దిగ్గజములను క్షణకాలము నివ్వెరపడునట్లు చేసెను. శత్రువుల గుండెలు తల్లడిల్లెను. కమలాకరుడు



మహా బలుడగు అంగరాజు కులభూపతిని యుద్ధమున జయించి, ప్రాణములతో నతని బందీగా పట్టుకొని తన తండ్రి యొద్దకు భటులతో పంపించెను. పిదప, తక్కిన రాజుల నందరిని జయించి, యుద్ధమున తలలు పగిలి మడిసిన యేనుగు కుంభస్థలములలోని ముత్యములతోపాటు తన కీర్తిని కూడ దిక్కులకు వెదజల్లి, విదిశానగరము చేరి వేత్రవతీ నదీ తటమున విడిసెను.

మరునాడు కమలాకరుడు తనకు కుమార్తెను ఇచ్చి వివాహము చేయుమని కోరుటకు మేఘమాలి మహారాజు వద్దకొక దూతను పంపెను. మేఘమాలి ఆ దూతవలన రాజకుమారుని వృత్తాంత మంతయును విని మిగుల సంతసించి, అతని విడిదికి వచ్చి "కుమార, నీవు కన్య నిచ్చి వివాహము చేయుమని ఆజ్ఞాపించినందులకు ధన్యుడను. నా కుమార్తె నీకు భార్య కాగలదని పూర్వము విష్ణువే నిర్దేశించెను. ఆమె యొద్ద నపూర్వమగు గుణమున్నది: ఆమె చేతితో తాకిన యెడల యెట్టి భయంకరమగు జ్వరమయినను శమించును. నేను నీకు నా కుమార్తె నిచ్చితిని. ఈ రాత్రి గడచిన పిదప రేపటి యుదయమే మీ పరిణయోత్సవము జరుగును." అనెను. కమలాకరుడు అతనిని గౌరవించి వీడ్కొల్పెను. మేఘమాలి తన నగరునకు మరలిపోయి తన రాణివాసమునకును, కుమార్తెకును ఈ వృత్తాంతము తెలియబరచెను.

తండ్రిమాటలు వినిన పిదప హంసావళి కమలాకరుని చిత్తరువును చూచి, అతని రూపమును ధ్యానించుచు, ఆ రాజకుమారుడు ఇతడగునో, కాదోయని డోలాందోళితమానస యాయెను. పిదప కనకమంజరియను తన చెలికత్తెను పిలిచి "సఖీ! నీవు మారువేసమునపోయి ఆ రాజపుత్రుని చూచి, ఈ చిత్తరువు లోనివాడు అతడౌనో కాడో చూచిరమ్ము, త్వరగారమ్ము." అని రాజకుమారుని విడిదికి పంపెను. కనకమంజరి కూట (కృత్రిమ) జటాజూటము ధరించి, కృష్ణాజినమును ఉత్తరీయముగా కట్టుకొని తపస్వినీ వేషముతో కమలాకరుని విడిదికి పోయెను.

ఎవరో తపస్విని ఏతెంచినదని సేవకులు మనవిచేయగా విని కమలాకరుడు వచ్చి ఆమెకు స్వాగతమిచ్చి సత్కరించి లోపలికి పిలుచుకొని పోయెను. మన్మథ సమానుడగు రాజకుమారుని చూడగనే కనకమంజరి మనసు మారిపోయెను. తన చెలియగు హంసావళిని మోసగించి తానే రాజకుమారుని పెండ్లియాడ నిశ్చయించుకొనెను. తర్వాత ఆమె రాజకుమారునికొక రత్నము కానుక యిచ్చి అతనిని ఆశీర్వదించి మరలి వచ్చెను.

కనకమంజరి రాజకుమారి ప్రాసాదమునకు పోయి, ఆమెతో కడుదీనముగా నిట్లనెను. "సఖీ. ఆ రాజకుమారుడు



ఉన్మత్తుడు. చుట్టును మంత్రులు మూగియుండిరి. భూతావిష్టునివలె అతడు నాకగుపడెను తెగులుతగిలి యెండిపోయిన మ్రోడును మాధవీలత అల్లుకొనునా? నీకు అతడు తగినవాడుకాడు."

హంసావళికి కనకమంజరి మోసకారియని తెలియదు. కావున, ఆమె దాని మాటలు నమ్మెను. చిత్రపటమునందలి కమలాకరుడు ఇతడు కాడను నిశ్చయమున అతనిని వివాహమాడుటకు విముఖురాలై, దుఃఖముతో కనకమంజరిని "సఖీ, నీవే నా వేసమున నాకు మారుగ ఆ రాజపుత్రుని వివాహమాడుము." అని కోరెను. కనకమంజరియును తనపాచిక పారినందులకు మిగుల సంతసించుచు, ఆ సంతోషమును పైకి కనుపడనీక "రాజకుమారీ, నేను నీ అధీనురాలను. నీవు ఊరివెలుపలి బూరుగుమాను తొఱ్ఱలో దాగి నాకై ఎదురు చూచు చుండుము. వివాహమయిన వెంటనే నేను నిన్ను కలిసికొనియెదను." అని హంసావళిని ఊరడించి, అశోకకరియను మరియొక చెలికత్తె వేషమును రాజకుమారికి వేసి, రాజకుమారి వేషమును తాను ధరించి, తన వేషమును అశోకకరికివేసి వివాహమండపమునకు వెడలెను. రాజకుమారియును అశోకకరి వేషముతో ఊరువెలుపలి బూరుగు మ్రానికడకు చేరి, భయంకరమగు దాని తొఱ్ఱచూచి, దానిలో కూర్చుండలేక ఒక పొగడచెట్టు గుబురులో

కూర్చుండి యుండెను. వివాహమహోత్సవ కోలాహలములో రాజకుమారి వెడలి పోవుటను ఎవరును చూడలేదు." కనకమంజరిని హంసావళి వేషమున నున్నందున, ఎవ్వరును సందేహింపరైరి. వివాహము కడు వైభవముగ జరిగెను.

రాజకుమారుడు ఆ కూటకన్యకను తోడ్కొని సపరివారముగ తన విడిదికి బయలుదేరెను. అతడు ఊరి వెలుపలికి బూరుగుమాను కడకు రాగానే కూటలి వధువగు కనకమంజరి మిగుల భయపడినట్లు నటించుచు "ఆర్య పుత్ర రక్షింపుము." అని అతనిని కౌగలించుకొనెను రాజపుత్రుడు అదరిపడి "ఏమిది ? నీ భయమునకు కారణమేమి ?" అని ప్రశ్నింపగా అది ఇట్లనెను:— "దేవా, నాకు రాత్రి కల వచ్చినది. ఈ బూరుగుమ్రాకు తొఱ్ఱలో నొక రాక్షసి యున్నట్లు కలలో కానవచ్చెను. ఆ రాక్షసి నన్ను పట్టుకొనుటకు వచ్చెను. నేను భయపడి పరుగెత్తితిని. ఎవరో బ్రాహ్మణుడు వచ్చి, నన్ను కాపాడెను. అతడు దయతో, ఈ బూరుగు మ్రాకును కాల్చివేయనిదే నీకు శ్రేయస్సు కలుగదని చెప్పెను. ఇంతలో మేలుకొంటిని. ఈ చెట్టును చూడగానే ఆ కల జ్ఞాపకమునకువచ్చి భయమాయెను. ఆర్యపుత్ర, నీవు అంతయున్న ఎరిగినవాడవు." కమలాకరుడు ఆ మాటలువిని ఆ శాల్మలీవృక్షమును కాల్చివేయుడని సేవకులకు ఉత్తరువు చేసెను. సేవకులును అట్లేచేసిరి. పిదప రాజకుమారుడు



కనక మంజరీ సమేతుడై తన విడిదిచేరి, మరునాడు కోసలకు తరలి వెడలెను.

పొగడచెట్టు గుబురులో దాగిన హంసావళికి కనక మంజరి మాటలు వినిపించెను. శాల్మలీ వృక్షమునకు రాజ సేవకులు నిప్పంటించుట చూచి కనకమంజరి మోసముచేసెనని వాపోయెను. "అహో ! అనురూపుడగు రాజ కుమారుని చూచి, ముగ్ధమానసి నగు నన్ను కనకమంజరి మోసగించినది. నిశ్శంకముగా సుఖముండుటకై బూరుగు మ్రానుకు నిప్పంటించినది. నన్ను చంపుటకే ఇట్లు కుట్ర పన్నినది. ఇతడు రతిపతి సమానుడు ప్రత్యక్ష పురుషోత్తముడు. ఆ చిత్రములోని రాజకుమారు డితడే. నే నెంత గ్రుడ్డిని. ఇంతకును నా దైవమిట్లున్నది ! దీనిని ఎవరు లంఘించగలరు ? దైవముకూడ నన్ను వంచించినది ఇంతకాలము కోరినపతిని పడయలేక బ్రతుకుట యెందులకు ? ఈ బూరుగుమ్రాకు మంటలలోపడి తనువు చాలించెదను." అని మరణించుటకు ఉద్యమించి, అంతలో దైవ మనుకూలించి కమలాకరుని బడయలేనాయనియు, కనకమంజరి మోసమునకు ప్రతీకారము చేయవలెననియు తలచి ప్రాణత్యాగ ప్రయత్నము మానుకొని యెటకో పోయెను.

కమలాకరుడు కోసల చేరినపిదప క్రొత్త పెండ్లికూతురగు కనకమంజరివి మనోరథసిద్ధి చూచెను "అయ్యో ! రాజపుత్రునికి మోసము జరిగినది. రాజపుత్రి హంసావళి యెచట

నున్నదో! ఎవరీ మోసమునకు పూనిరో!" అని చింతించుచు తన యింటికిపోయి, తల్లితో సకలవృత్తాంతము చెప్పెను. రాజకుమార్తెను వెదకుటకు బయలుదేర నిశ్చయించెను. తల్లి అతనిని వారించి "నాయనా, రాజరహస్యము మనలను కాల్చి వేయును. నీవూరకుండుము. దైవమనుగ్రహించిన సర్వమును అనుకూలించును." అని చెప్పగా అతడూ మిన్న కుండెను.

ఇట హంసావళియు జనుల కంట బడుట కిష్టపడక కారడవులలో "హా! తండ్రీ! హా! జననీ! అని విలపించుచు దిరుగుచు కొంతకాలము గడపెను. పిదప నొకనాడు సుందరమగు మరియొక యడవిచేరెను. పక్షుల మనోహర కూజితములు ఆమెకు సంతోషము కలిగించెను. ఆమె అచ్చటి సరోవరతీరముననే నివసించి తామరపూవులతో నారాయణుని పూజించుచు ఆవనములోని కందమూలఫలములను తినుచు గడుపసాగెను.

కోసలమున కమలాకరునికి ఘోరమగు జ్వరము కలిగెను. అది ఎన్నాళ్ళయినను కుదరలేదు. కపట హంసావళియగు కనకమంజరి అదిచూచి ఖిన్నురాలై ఇట్లు యోచించెను. "అయ్యో! నాకు పరీక్షాకాలము సంప్రాప్తించినది. హంసావళి తాకినచో ఎట్టి జ్వరమయినను తొలగిపోవునను



ప్రవాదమున్నది. నాభర్త జ్వరనివారణమునకు నన్ను పిలిపించిన నేనేమిచేయుదును? పెండ్లి అరణముగా నావెంట వచ్చిన చెలికత్తె అశోకకరి యిచ్చట నా వేషమున కనకమంజరియై వ్యవహరించుచున్నది. అది నా గుట్టును ఎప్పుడు బయటపెట్టునో యేమో! నా వలెనే చెలికత్తెలందరును ద్రోహము చేయువారే. పూర్వము భద్రశివయను యోగిని నాకొక మంత్రముపదేశించెను. శూన్యమగు శివాలయమున నల్లమేక రక్తమాంసములు నివేదించి పూజించి, పిదప నరబలియిచ్చిన మంత్రముసిద్ధించి, జ్వరహరమగు శక్తికలుగును. ఈ అశోకకరిని బలియిత్తును. దీనివలన నాగుట్టు రట్టగునను భయము తొలగును; రాజు జ్వరమును తొలగును."

ఈరీతిగా ఆ వంచకురాలు తలపోసి, నరబలి తక్కతక్కిన విషయములను అశోకకరికి తెలియజేసి. దానిని తోడ్కొని శివాలయముచేరెను. అట, యథావిధిగ పూజలొనర్చి, అశోకకరిని నమస్కరింపుమని చెప్పి. అది నమస్కరించుటకు వంగినప్పుడు దాని మెడపై కత్తితో కొట్టెను. దైవవశమున ఆ వ్రేటు తప్పిపోయెను. అశోకకరి దిగ్గునలేచి, ప్రాణభయమున "రక్షింపుడు, రక్షింపుడు" అని మొరపెట్టుచు పరుగెడివచ్చి రాజాంతఃపుర ద్వారపాలకుల శరణు

జొచ్చెను. దానివెంటనే తల విరియబోసికొని, చేత ఖడ్గముతో వచ్చుచున్న కనకమంజరిని చూచి వారు, రాక్షసి యని భావించి కొట్టి కట్టివేసిరి. పిదప వారిరువురిని కమలాకరుని ఎదుటికి తీసికొని పోయి, అంతయును నివేదించిరి.

అశోకకరి కమలాకరునికి కనకమంజరి చేసిన మోస మంతయును పూసగ్రుచ్చినట్లు చెప్పెను. కమలాకరుడు ఆ మాటల నిజ మరయ దలచి వందిమాగధుడగు మనోరథసిద్ధిని పిలిపించి హంసావళిని గుర్తుపట్టుమనెను. అతడు "ఈమె హంసావళి కాదు; ఆమె చెలికత్తె. నేను, మీరు వివాహమై వచ్చిననాడే యిది తెలిసికొంటిని. రాజ రహస్యము నా కెందులకని మిన్నకుంటిని." అని విన్నవించెను కమలాకరుడు "అయ్యో! కుసుమకోమలయగు హంసావళిని మంటలలో కాల్చి వేసితినే! ఈ సంతాపము ఎన్ని యుగములయినను తొలగదు." అని సంతాపము చెందెను. వందిమాగధుడు అతనిని సమాశ్వాసించుచు, "దేవ, వైక్లబ్యము చెందకుము. విష్ణువు ననుగ్రహము వలన నీవు మరల ఆమెను పొందగలవు. మోహమును సంతోషముతోను, వ్యసనమును ధైర్యముతోను, ప్రమాదమును నీతిజ్ఞతతోను సమూలముగ నాశము చేయవలెను. ధీమంతులకు, సత్యవంతులకు, సమర్థులకు, ఎల్లప్పుడు కృషి చేయువారికి మనోరథము ఒక్కమారు



త్రుంచి వేయబడినను మరల చిగురించును." అని విన్నవించెను. కమలాకరుడును అతని మాటలు విని, మంత్రులకు రాజ్య మప్పగించి అతనిని వెంటనిడుకొని హంసావళిని వెదకుటకు బయలు వెడలెను.

వారిరువురును అట్లు వెదకుచుబోయి దైవవశమున హంసావళి యుండు కాననమును జేరిరి. అవశ్యముగ సంభవించువానికి తనంతటనే మార్గ మేర్పడునను నార్యోక్తి సత్యము. అట పూచిన తీగ పొదరిండ్లతో, ఝుమ్మను తేనెటీగల రొదతో, అందముగా నున్న ఆ వనమున ఒక సరోవర తీరమున పుండరీకాక్షుని పూజించుచున్న హంసావళి యగుపించెను. మనోరథసిద్ధి ఆమెను ఆనవాలు పట్టి, "దేవ, అటుచూడుము. ఆమెయే హంసావళి. చంద్రుని రాజయక్ష్మ క్షయించుటకు వ్రతమాచరించుచున్న రోహిణివలె నున్నది." అనెను. కమలాకరుడు తన మనోరథసిద్ధివలెనున్న ఆమెను చూచి మిగుల సంతృప్తి చెందును. మనసులోని కోరిక సిద్ధించినప్పుడు ఎవరికి సంతృప్తి, సంతోషము కలుగవు? హంసావళియును హఠాత్తుగా కమలాకరుని చూచి దిగ్భ్రాంతురాలయి, వెంటనే మనోరథసిద్ధిని కని గుర్తుపట్టి, దుఃఖ సంతోషములు పట్టజాలక మూర్ఛపోయెను. వారిరువురును శైత్యోపచారములు చేయ కొంత సేపటిలో ఆమె తెప్పరిల్లెను,

పిదప కమలాకరుడును, హంసావళియు తమ కష్ట గాథలను ఒండొరులకు చెప్పుకొనిరి. అనంతరము కమలాకరుడు హంసావళిని, మనోరథసిద్ధిని వెంటనిడుకొని కోసల చేరెను. విదిశనుండి మేఘమాలిని పిలిపించి, హంసావళిని పరిణయమాడెను.

"కావున, నాయనా, బ్రతికియుండిన గదా శుభములు పడయవచ్చును; త్వరలో మిత్రుని కలిసికొందువు. చింతింపకుము." అని ఆ ముదుసలి పాంథుడు నన్ను ఆత్మహత్యా ప్రయత్నమునుండి తప్పించి తనదారిని పోయెను.

## వృద్ధాఖ్యాయిక

"దేవా, పిదప నేను ఆ పాంథుని మాటలతో నుత్సాహము చెంది, నెమ్మదిగా ఉజ్జయినీ నగరముచేరి, ఒక పూటకూలి యవ్వయింట విడిసితిని. ఆమె భోజనమునకును, విడిదికిని నా యొద్ద మూడు రూపాయలు తీసికొని ఒక గదిలో పరుండుటకొక కుక్కిమంచము నిచ్చెను. అలసియున్నందున నాకు నిద్రపట్టెను. ఏవియో మంత్రములు వినబడుచుండగా మెలకువ వచ్చెను. కుతూహలముతో సోరణగండ్లనుండి చూచితిని. ముసలిది మంత్రములు పఠించుచు పిడికెడు ధాన్యము చల్లెను. అవి వెంటనే మొలచి పండెను. ఆమె వానిని కోసి, వేయించి, పేలపిండిచేసి ఒక కంచుగిన్నియలో పెట్టి, మరల



నిట్లే పేలపిండి సిద్ధపరచి మరియొక కంచుగిన్నియలో పోసి నాకై విడిగానుంచి స్నానముచేయుటకై యేటికి బోయెను. నేనును లేచి, ఆ రెండు గిన్నెలను తారుమారు చేసియుంచి నిద్ర నటించుచుంటిని. ఇంతలో ముసలిది వచ్చి నన్ను లేపి, తానొక పేలపిండి గిన్నె తీసికొని, నా కొక గిన్నె నిచ్చెను. ఆ పేల పిండిని తినగనే ఆమె ఆడుమేకగా మారెను.

నాకు చాల విస్మయము కలిగెను. నేను కసికొలది ఆ మేకను గట్టిగా పట్టుకొని, కటికవానికి అమ్మదలచి లాగుకొని పోయితిని. ఒక కటికవాని భార్య నన్నుచూచి "క్రోధముతో పెదవులు అదరుచుండగా, పాపిష్ఠుడా, నా నెచ్చెలిని మోసగించితివి. దీని ఫలము ననుభవించెదవులే," అనెను. నేను ఆ మేకను వదలిపెట్టి ఊరివెలుపల నొక చెట్టుకింద నిద్రపోయితిని. ఎవరో నా మెడకు దారము బిగియించుచున్నట్లు తోపగా, మెలకువ వచ్చెను. కటికవాని భార్య నా మెడకు దారము తగుల్చుచుండెను. నేను నెమలినై పోయితిని. పూర్వస్మృతిమాత్రము పోలేదు. కొన్ని నాళ్ళకు బెస్తలు నన్ను పట్టుకొని ఈ ప్రతీహారునికి అమ్మిరి. అతడు నన్ను తన యాడువారి ఆటవస్తువుగా నిటనుంచినాడు. నా అదృష్టవశమున నేడు నీ వలన నా పక్షిరూపము వదలగలిగితిని. నీ సేవాసుఖమును పొందగలిగితిని. ఇటనుండి మనమిరువురము

తప్పించుకొని పోవుట మేలు. ఈ రహస్యము బయట పడు నను శంకతో నిన్నితడు చంపివేయును. ప్రతి రాత్రి యందును, వీడు చంపని హతభాగ్యుడున్నాడా ? మనమందిర ద్వారము నకు వెలుపల గడియవేసి యున్నారు. మందిరము చుట్టును భటులు కావలియున్నారు. తెల్లవారగనే ఏమి జరుగునో ; మనము ఈ మంత్రసూత్రబలమున నెమళ్ళమై వాతాయనము మార్గమున తప్పించుకొందము. నీవు మొదట నీదారము మెడకు తగిలించుకొని నెమలివై ఈ వాతాయన మార్గమున వెలుపలికిపోయి వ్రాలుము. నీ మెడలోని దారమును నేను ఇటనుండి విప్పి నా మెడకు తగిలించుకొని వెలుపలికి వత్తును. పిదప నీవు నా మెడదారము విప్పి నన్ను మానవుని చేయుము" అనెను.

మృగాంకదత్తుడు భీమపరాక్రముని మాట ప్రకారము చేసెను. ఇరువురును చండకేతువు బంధనముల నుండి తప్పించుకొని తమ విడిదిచేరిరి. మృగాంకదత్తుడు భీమపరాక్రముని శ్రుతధికిని, విమలబుద్ధికిని చూపెను. వారందరును తమ కష్టములను చెప్పుకొనుచు రాత్రి గడిపిరి.

మరునాడు మృగాంకదత్తుడు మిత్రులతో ఎప్పటియట్ల మాయావటుని సభాస్థలికి పోయెను. పాచిక లాడ రమ్మని మాయావటువు కోరెను. శ్రుతధి అడ్డుతగిలి "రాజా, జూద



మెందులకు ? ప్రతీహారుడు నిన్న చెప్పిన విచిత్ర మయూర నృత్యము నడచుగాక!" అనెను. మాయావటువు శ్రుతధి మాటలువిని మయూరమును తెమ్మని చండకేతుని ఆజ్ఞాపింపగా, అతడు దానిని తెచ్చుటకు ఇంటికిపోయెను. ఇంటికి పోయి చూడగా, రాత్రి బంధించిన వ్యక్తియును, మయూరమును కనబడలేదు. అతడు పరిపరివిధముల నాలోచించుచు నిషాద రాజుకడకు వచ్చి, "రాజా నా నెమిలిని ఎవ్వడో దొంగ లించుకొని పోయెను" అని విన్నవించెను. శ్రుతధి ఆ మాట లకు నవ్వుచు దొంగ నెమలిని దొంగలించెనా ? నెమలియే దొంగను దొంగలించెనా ? నీకు దొంగ సంగతి గాని, నెమలి సంగతిగాని తెలియదు." అనెను. మాయావటువు అతని మాటలకు విస్మయముచెంది విశదముగా తెలుపుమనగా శ్రుతధి రాత్రి వృత్తాంతమంతయును తెలిపి, "స్త్రీలకు నమస్కారము" అనెను. మాయావటుడును అతని మాటలు విజ మరయగోరి మంత్రసూత్రమును చండకేతుని మెడకు బిగించగా, అతడు మయూరముగ మారెను. శబరరాజు చండకేతుని సంహరించి, స్త్రీ వధార్హురాలు కాదని తన రాణియగు మంజుమతిని పట్టణమునుండి వెడలగొట్టించెను. ద్రోహమెప్పటికైనను విపత్కరమైనదే !

మృగాంకదత్తుడు శబరరాజు కోరికపై ఆ పల్లెలోనే కొన్నాళ్లు గడపెను.

# 4

# శబర నగర వృత్తాంతము

—oo✻oo—

ఇట్లు కొన్ని దినములుగడచెను. ఒకనాడు కొందరుశబరులు వచ్చి, శబరాధిపతియగు మాయావటువును దర్శించి "దొరా దుర్గాదేవికి బలియిచ్చుటకై ఒక వీరుని పట్టి తెచ్చితిమి. అతడు మహా సత్త్వవంతుడు, ఐదువందలమంది శబరులను సంహరించిన వాడు. బలికి మీరు చెప్పిన లక్షణము లన్నియు నతనివద్దనున్నవి." అని విన్నవించిరి, మాయావటువు ఆ మాటలువిని ఏలాటి తడబాటునుచూపక "పిలుచుకొనిరండి చూతముగాక," అని ఆజ్ఞ యిడెను. శబరులు ఒక వీరుని తాళ్ళతోకట్టి లాగుకొని వచ్చిరి. అతడు పెక్కు సంగ్రామములు చేసి క్షతగాత్రుడయియుండెడు. ఆ గాయములపై ఈగలు ముసురుచుండెను. అతడూగుచు శబరరాజు నెదుట నిలబడెను. మృగాంకదత్తుడు అతనిని తేరిపారజూచి తన మంత్రియగు గుణాకరుడని గుర్తించి తటాలునలేచి అతనిని కౌగలించుకొనెను. అతడును ఆశ్చర్యపడి, రాజకుమారుని పాదములపై వ్రాలెను. మృగాంకదత్తుడు శబర రాజునకును, తక్కినవారికిని తన మిత్రునిసంగతి తెలియబరచెను. వారును



విని ఆశ్చర్యపడిరి. శబరరాజు అతనిని బంధ విముక్తునిజేసి ఉచితరీతిని గౌరవించి చికిత్సచేయించి స్వస్తుని జేసెను. పిదప మృగాంకదత్తుడు "మిత్రమా, ఎందులకీ గాయములు? ఏమి నీ వృత్తాంత విశేషము?" అని ప్రశ్నించెను అత డిట్లు చెప్ప దొడగెను.

## గుణాకరాఖ్యాయిక

"దేవా, ఆ నాడట్లు నాగరాజ శాపముచే నేను మూర్ఛిల్లి. కొంతకాలమునకు మూర్ఛతేరి దారి తెలియక మిమ్ములను కానక తిరుగుచు, వింధ్యారణ్యమున ప్రవేశించితిని. తిరిగి తిరిగి యలసిన నాకొక దేవాలయము కనిపించెను. అది వింధ్యవాసినీ దేవాలయము. ఆ దేవాలయద్వారమునకు బలియిచ్చిన మానవుల తలలు, తోరణముగ కట్టియుండిరి. దేవాలయమున ఎటచూచినను, మానవ శిరములు మహిష శిరములు నెత్తురు కారుచు పడియుండెను. కాకులు గ్రద్దలు వానిని పీకి తినుచుండెను. వేయేల అది కాలుని క్రీడా గృహమువలె నుండెను. ఆ బీభత్స దృశ్యము చూచి నాకును ఆత్మహత్యాబుద్ధి కలిగెను. అటపడియున్న ఒక కత్తిని తీసికొని, గొంతు నరకికొనబోయితిని. ఇంతలో నొక తాపసి వచ్చి నన్ను వారించి, దయతో నా దీర్ఘకథను విని ఇట్లు ఊరడించెను: "పుత్రా, శోకింపకుము. తప్పక నీకు

శుభములు కలుగును. ధైర్యహీనునికి విద్య, కులము, సిరి ఒప్పవు. యుద్ధమున ఓడిపోయి వచ్చిన ఏనుగుమీది డిండిమము ఏమి ప్రయోజనము ? మహా కాననమున తిరుగు భ్రమరములు కలిసికొన్నట్లుగా, మానవులు మరల తమవారిని కలిసికొందురు. దీని కొరక గాథ వినుము."

## వినీతమత్యాఖ్యాయిక

"పూర్వము పాంచాల దేశమును ఉదయతుంగుడను రాజు ఏలుచుండెను. అతనికి కమలాక్షుడను ప్రతిహారు డుండెను. అతడు మతిమంతులలో శ్రేష్ఠుడు. నయవిశారదుడు. ఆ ప్రతీహారునికి వినీతమతి యను పుత్రు డుండెను. అతడు తన పేరుకు తగినట్లే గుణవంతుడు. అతడు మేటి విలుకాడు. అతడు ఒకనాటి రాత్రి తన యశస్సువలె తెల్లని వెన్నెలలో విహరించుచుండగా ఏడుపు వినిపించెను. అతడు ఆ ఏడుపు సవ్వడిని వెదకికొనుచు పోగా, ఒక చెట్టు క్రింద ఒక కన్యక కూర్చుండి ఏడ్చుచుండుట కనిపించెను. ఆ కమలలోచన ఏనుగులు మట్టి వదలిన తామరతీగవలె విషణ్ణయయి యుండెను. రాజకుమారుడు వినీతమతి "సుందరీ, నీ వెవ్వరవు ? ఎందులకిట్లు దుఃఖించుచున్నావు " అని ప్రశ్నించెను. ఆమె తన తెల్లని పలువరసతో వెన్నెలలు వ్యాపింపజేయుచు నిట్లనెను.



"మహాభాగ, నా పేరు విజయవతి. గంధమాలియను నాగరాజు కూతురను. నా తండ్రి యొకమారు యుద్ధమున నోడిపోయెను. నాగచక్రవర్తియగు వాసుకి నా తండ్రిని చూచి, శత్రువులకు దాసుడవగుదువని శపించెను. ఆ శాప బలమున నా తండ్రి కాలజిహ్వుడను యక్షునికి పూవులు మోయుచుండు బానిస యాయెను. నా తండ్రి దాస్యము విడిపింపుమని నేను గౌరీదేవిని గురించి తపస్సు చేసితిని. దేవి నా తపమునకు మెచ్చి, "బిడ్డా, ఈ గుఱ్ఱమును, కత్తిని తీసికొమ్ము. వినీతమతియను రాజకుమారుడు వీనితో నీ తండ్రి శత్రువగు కాలజిహ్వుని జయించి, శాపమోక్షము కలుగజేయును." అని ఆనతిచ్చెను. నిన్ను ఆ పనికి ప్రోత్సహించుటకై, నేను విలపించితిని. నా కోరిక మన్నించి, నా తండ్రిని బానిసతనమునుండి విడిపింపుము. అని వేడికొనెను.

వినీతమతియును విజయవతి వేడికోలునకు అంగీకరించెను. పిదప ఆమె తెచ్చిన గుఱ్ఱమెక్కి, ఇచ్చిన కత్తి పట్టుకొని, గుఱ్ఱము మహిమచే కాలజిహ్వుని నగరముచేరి అతనిని యుద్ధమునజయించి, విజయవతి తండ్రియగు గంధమాలిని దాస్యమునుండి విడిపించెను. కాలజిహ్వుడును వినీతమతికి ఈతిబాధానిబర్హణమగు ఒక రత్నాంగుళీయకమును బహూకరించెను. గంధమాలి మిగుల సంతోషపడి, విజయ

పతిని ప్రతీహారకుమారునికి సమర్పించెను. అతడు నాగ కన్యతో గుఱ్ఱమెక్కి పాంచాలము చేరుకొనెను. తండ్రి కమలాక్షుడును; రాజు ఉదయతుంగుడును మిగుల సంతోషించిరి. పిదప వినీత మతికిని, విజయవతికిని వివాహము జరిగెను.

ఇట్లుండగా, ఉదయతుంగుని కూతురు ఉదయవతి యనునది సకల విద్యాకోవిదురాలగుటవలన దర్పముతో "ఎవడు నన్ను విద్యావాదమున జయించునో అతనిని నేను వివాహ మాడుదును" అని చాటించెను. వినీతమతి తన తండ్రి ఆనతిలో రాజకుమారితో వాదించి, గెలిచెను. రాజు మిగుల ఆనందించి. అతనికి తన కుమార్తెను ఇచ్చి వివాహ మొన ర్చెను. వినీతమతి ఇరువురు భార్యలతోను సుఖముగా నుండెను.

ఒకనాడు వినీతమతి పాచికలాడుచుండగా, ఒక విప్రుడు వచ్చి భోజన సామగ్రి యిమ్మని యాచించెను. ద్యూత వినోద వ్యగ్రుడగుట వలన స్వయముగ భోజనసామగ్రిని సమకూర్పలేక, తన దాసుని ఆదేశించెను. ఆ దాసీడు ఇసుక నింపిన పాత్ర మును గుడ్డతో కప్పి బ్రాహ్మణునకిచ్చెను. రాజ పురుషులయొద్ద నుండు సేవకులు వేపవిత్తువంటి వారు. సమయము వచ్చినప్పు డెల్ల తమ చేదును చూపుచునేయుందురు. బ్రాహ్మణుడుపోయి, ఎంతయో ఆశతో పాత్రపై కప్పిన గుడ్డను తొలగించి చూడగా ఇసుక యుండెను. అతడు చాల వగచెను. దాసుడు చేసిన



పాపము వినీతమతికి చుట్టుకొనెను. వినీతమతికి ఇది యావంత యును తెలియదు.

కొంతకాలము గడచెను. ఉదయతుంగమహారాజు కడు వృద్ధుడాయెను. తన రాజ్యమును అల్లుడగు వినీతమతికి అప్ప గించి పరలోకగతుడాయెను. వినీతమతియును దేవీదత్తమగు అశ్వరాజము, వరఖడ్గము ప్రభావమున భూమండలమును జయించి, యక్షుడిచ్చిన ఈతిబాధానివారణమగు అంగుళీయకముతో దేశ మును సుభిక్షముగ రామ రాజ్యమువలె ప్రజాప్రియముగ పాలించు చుండెను.

ఒకనాడు వినీతమతియొద్దకు రత్నచంద్రమతి యను బౌద్ధభిక్షువు వచ్చెను. అతడు వాదిగజములకు సింహమువంటి వాడు. "రాజా, మనము వాద మొనర్తము, నీవు ఓడిపోదు వేని నా బౌద్ధమత దీక్ష గైకొనవలెను. నేను ఓడిపోదునేని నీ వైదిక మతమును అవలంబింతును. ఇది మనకు పందెము." అని అతడు రాజును వాదమునకు బిలిచెను. రాజు అందులకు ఇయ్యకొని అతనితో నెనిమిది దినములు వాదించి ఓడిపోయెను. పందెము మేరకు అతడు బౌద్ధధర్మమును స్వీకరించి, ఐశ్వర్యమునకు ఫలమనదగిన, లక్ష్మీదేవి కంఠహారమునకు ఫలక మనదగిన ఒక విహారమును, చైత్యమును నిర్మించెను. అచట భిక్షుసంఘములు చేరి లోకనాథుడగు బుద్ధుని ఆరాధింపసాగిరి.

ఆ రాజు పర్యంతబుద్ధితో పరమోపదేశము పొంద దలచి గురువగు రత్నచంద్రమతి కడకుపోయి తన కోరికను విన్నవించెను. "రాజా. పాపములెల్ల తీరినవారే ఇట్టి పరమోపదేశమునకు అర్హులు. నీవు మహా పుణ్యవంతుడవు. నావంటివారికి కనిపించు స్థూలములగు పాపములు నీయొద్ద లేవు సూక్ష్మములగు పాపములున్నవేమో! వానిని పోగొట్టుకొనుటకు స్వప్నసాధనమును ఉపదేశింతును. దాని వలన నీవు చేసిన సూక్ష్మపాపములు స్వప్నములో కనిపించును. వానిని సత్కార్యములతో పోగొట్టుకొని పరిశుద్ధుడవై పరమోపదేశముపొంది బోధచర్యను అవలంబింప వచ్చును," అని రత్నచంద్రమతి నుడివి అతనికి స్వప్న సాధన ప్రకారముపదేశించెను.

అతడును విధివశాత్తుగా స్వప్న సాధనమును ఆచరించెను. ఒకనాడు స్వప్నమున అతనికి ప్రేతభూమియందు మండుచున్న ఇసుకదిబ్బ కనుపించెను. తనకు ఆకలి మండిపోవుచుండెను. అ ఇసుక దిబ్బయొద్ద కావలియున్న దండహస్తులను అన్నమడిగెను. వారు మిగుల క్రూరవాక్కులతో "ఆ మండుచున్న ఇసుకను తినుము. పూర్వము నీవు పాచికలాటలో మునిగి, ఒక విప్రునికి ఇసుకనిండిన పాత్రను గుడ్డకప్పి యిచ్చితివి దానిఫలితమిది. దశకోటి సువర్ణ టంకములు దానిమిచ్చిన ఈ పాపము తొలగును" అనిరి. వినీతమతి



దిగ్గున మేల్కొని సుగతుని స్మరించుచు ఉదయము కాగానే, ఈ స్వప్నవృత్తాంతము గురువునకు నివేదించెను. పిదప అతని ఆజ్ఞ మేరకు శతకోటి బంగారునాణెములు యాచకులకు దానమిచ్చి, పాపము తొలగెనని సంతృప్తితోనుండెను. కాని, మరి యొకనాడును మరల నట్టి కలయే కనెను. ఆకలితో అన్నమడుగగా, మరల దండపాణులు మండుటిసుకయే తినుమనిరి. "నేను దానము చేసితినే మరల నిదేమి?" యని రాజడిగెను. "నీ దానము వ్యర్థమాయెను. ఒక యాచకుని సువర్ణ టంకములను దొంగలు దోచుకొనిరి. నీవు దానమిచ్చితివే కాని, దాన ద్రవ్యము సురక్షితముగా నుండుపద్ధతిని చూడవైతివి. కాన నీ దానము నిష్ఫలము. మరల దశకోటి బంగారు నాణెములిచ్చి, యాచకులకు రక్షణము కల్పించి పాపము పోగొట్టుకొనుము." అని దండపాణులు చెప్పిరి. రాజు మేల్కొని ఉదయమున తన గురువునకు ఈ వృత్తాంతము నివేదించి, యట్లే చేసెను. అనంతరము గురువు నెమ్మదిగా అతనికి బుద్ధకథలను తెలుపుచు నిట్లనెను:— "నరేంద్రా, దానము వీరులకు ఉత్సాహదాయకము. సత్పురుషులకు సిద్ధిదాయకము. నీవు సత్పురుషుడవు. నీ కిది సిద్ధిదాయకము నిజధర్మమును ఏమరక చేయు సత్పురుషులకు దేవతలు రక్షకులై యుందురు." అని దాన వీరుడగు బోధిసత్త్వుని పూర్వగాథలు చెప్పి బోధిసత్త్వచర్యలను ఉపదేశించెను. అతడును

ఆ చర్యను అవలంబించి అర్థులకు కల్పపాదపమువంటివాడై రాజ్యమేలుచుండెను,

ఒకనాడొక విప్రుడు వచ్చి వినీతమతితో ఇట్లు విన్నవించెను. "రాజా, నేను పాటలీపుత్ర నగర వాస్తవ్యుడను. ఒక బ్రహ్మరాక్షసుడు నా యజ్ఞశాలను ధ్వంసముచేసి, నా కుమారునిగూడ అపహరించెను. నీవు యాచకుల పాలిటి కల్పవృక్షమవు గాన నిన్నొక్కటి యాచింప వచ్చితిని. ఈతిబాధాహరమగు ఈ రత్నాంగుళీయమును నాకు దానము చేయుము." రాజు మారు పలుకక అతనికి ఉంగరము నిచ్చి పంపెను. మరి యొకప్పుడు ఇందుకలశుడను రాజకుమారుడు వచ్చి తన వంశ శత్రువులను జయించుటకు అతని వరాశ్వ ఖడ్గములను కోరెను. వినీతమతి వానిని అతనికిచ్చి పంపివేసెను. ఇంకొకనాడు ఇందుకలశునివలన తన రాజ్యమును కోల్పోయిన రాజొకడు వచ్చి "దేవా, నీవు దానమిచ్చిన కృపాణముచే నా శత్రువగు ఇందుకలశుడు నా రాజ్యము నపహరించెను. నా పేరు కనకకలశుడు" అని దీనముగా నుడివెను. వినీతమతి తనకు సంతానము లేదుగావున అతనినే కుమారునిగా భావించి, తన రాజ్యమా కనకకలశునకిచ్చి భార్యాసహితుడై అరణ్యమునకు పోయెను. అతని పుణ్యముచే అతడు వసించు వికటాటవియు నందనవనమువలె శోభిల్లెను. రాజు సతీసమేతుడై తప మాచరించుచు గడుపుచుండెను.



రాజు ఒకనాడు తన వనమున దిరుగుచుండగా, ఉరిపోసికొని ప్రాణములు వదలుటకు ఉద్యమించుచున్న ఒక వ్యక్తి అతని కంటపడెను. అతడు ఆ వ్యక్తియొద్దకు పరుగున పోయి, అతని దుష్ప్రయత్నమును మాన్పి, సమాధాన పరచి, అతని వృత్తాంత మడిగెను. అతడిట్లు చెప్పసాగెను :—

"తపస్వీ, నా పేరు సోమాశ్రముడు. నా తండ్రి పేరు నాగశూరుడు. నేను పుట్టినప్పుడే జ్యోతిష్కులు "నీ కుమారుడు దొంగయగును" అని చెప్పిరట. వారి మాటను వమ్ము చేయుటకు నా తండ్రి నన్ను మిగుల శ్రద్ధతో చదివించి విద్యావంతుని చేసెను. విద్య యనునది మానవులకు అజ్ఞానాంధకారమున వెలుగుజూపు సహజమగు దీపము గదా! నా తండ్రి యెంత చేసినను నేను దుష్టసహవాసమున బడి, దొంగనైతిని. ఎవరి లలాటలిఖితమును ఎవ్వరు మార్చగలరు. నా దొంగతనము రాజు చెవిలో బడెను. నన్ను రాజభటులు బంధించి లాగుకొని పోవుచుండిరి. ఇంతలో కట్టు గొలుసులు త్రెంచుకొని రాజు నేనుగొకటి మావైపు దూసికొని వచ్చెను. ఆ కోలాహలములో రాజభటులు నన్ను వదలి పారిపోయిరి. నేను కట్లు విడిపించుకొని జనుల కనుమొరగి తప్పించుకొని ఇల్లు చేరితిని. నా దుఃఖముతో నా తండ్రియు, తల్లియును మరణించిరని ఇరుగు పొరుగువారు చెప్పిరి. నేను ఇక జన్మమెందులకని రోసి, ఎట్లో తిరిగి యిటకు పచ్చి, మరణించుటకు

ఉద్యమించితిని. అప్పుడు నా కొక దివ్యాంగన ప్రత్యక్షమై కరుణాపూర్ణ బుద్ధితో నన్ను పలుకరించి "పుత్రా, వినీతమతి నివాసముతో పవిత్రమైన ఈ ఆశ్రమము చేరితివి. నీపాతకము లన్నియు క్షీణించినవి. పోయి, అతనివలన పారమితోపదేశములను పొందుము" అనెను. నేనును అతనిని అన్వేషించుచు అతనియునికి తెలియక విసిగి మరల నిట ఆత్మహత్యకు కడంగితిని."

## పారమితాఖ్యాయిక

కృపాసింధువగు వినీతమతి అతనిని చల్లని మాటలతో సేదదేర్చి, తానే వినీతమతియని తెలిపి, తన యాశ్రమమునకు పిలుచుకొనిపోయి, ఆతిథ్య మొసగిన పిదప ఇట్లుపదేశించెను. "కుమారా, విచారము, విమర్శ యనునదే మానవులకు మంచిమార్గము చూపునది. ఆ సన్మార్గము అకృత్రిమ బుద్ధులకు స్ఫురించునుగాని, మాయావులకు స్ఫురింపదు. ధర్మాధర్మ విచారము చేయగ, గర్వావేశముతో ముందు వెనుకలరయక పనులు చేయువారు పాపగర్తమున పడుదురు. పారమితల కథలను వరుసగా చెప్పెదను వినుము. దాని వలన సంసార వాసనతొలగి బుద్ధి విమలమగును.

"పూర్వము కురుక్షేత్రమున మలయ ప్రభుడను రాజుండెను. అతని కుమారునిపేరు ఇందుప్రభుడు. అతడు



త్యాగమునకు రత్నాకరుని వంటివాడు; దానమున తండ్రిని మించియుండెను. ఒకప్పు డా దేశమునకు దుర్భిక్ష మేర్పడెను. అప్పుడతడు తపస్సుతో ఇంద్రుని సంతోషపెట్టి, తానుకల్పవృక్షమగునట్లు వరము కోరుకొనెను. ఇంద్రుని యనుగ్రహమున నతడు కల్పవృక్షమై ప్రజల కష్టములతీర్చుచు, తుదకు ఇంద్రలోకము చేరెను. కురుక్షేత్రవాసు లందరును శరీరముతోడనే స్వర్గము చేరిరి. ఆ దానశీలుని కీర్తి పతాకమే వియద్గంగ. దానమనునది తాపములను అణచివేయు పీయూషజలదము! కష్టాంధకారములను పోగొట్టు సూర్యుడు ఈ ప్రపంచమున దానమే సకల శుభ సంపదలకు నిదానము.

"ఇక శీలపారమితను చెప్పెదను వినుము. పూర్వము వింధ్యారణ్యమున శుకసహస్రములకు రాజగు హేమప్రభుడను చిలుకరేడుండెను. అతనికి చారుమతియను ప్రతీహారుడుండెను. ఒకనాడు చారుమతి భార్యను వేటకాండ్రు వలలు పన్ని పట్టుకొని చంపివేసిరి. ప్రతీహారుడు ఆదుఃఖమున చిక్కిపోదొడగెను. శుకరాజు అదిచూచి, అతని వ్యామోహమును వివిధోపదేశములచే పోగొట్టి, సచ్ఛీల మార్గమున నుంచెను. ప్రతీహారశుకము అప్పటినుండి, ప్రియావ్యామోహముమాని, శీలవంతమై యుండెను.

"ఇక క్షమాపారమితను వినుము, పూర్వము కేదార పర్వతమున శుభనయుఁడనుముని తపమాచరించుచుండెను. అంతకుముందు ఆ ప్రాంతమున కొందరు దొంగలు తా మపహరించిన ధనమును పూడ్చిపెట్టియుండిరి. వారువచ్చి ఆ ధనమునకై వెదుకగా అది దొరకలేదు. "ఈ దాంభికుడగు మునియే మనధనమును అపహరించియుండును. దొంగల ధనమునుకూడ దొంగిలించు గజదొంగవీడు" అని దొంగలు అనుమానించి, అతని చేతులు నరకి, కన్నులు పెకలించి వేసిరి. ముని కొంచెమైనను ఓర్పువదలలేదు. మరునాడు అతనిశిష్యుడగు శేఖరద్యుతి యనురాజు అతనికి నమస్కరించుటకు వచ్చెను. గురుడు చేతులుతెగి, కన్నులు లేక రక్తపు మడుగ్గున పడియుండుటగని చికిత్సచేయించి, చారచక్షువు గనుక చారులవలన విషయమంతయు తెలిసికొని. క్రుద్ధుడై ఆ చోరులను పట్టితెప్పించి వారికి మరణదండము విధించెను. ముని రాజును బ్రతిమాలి చోరులశిక్షను తప్పించెను. ముని అంత్యకాలమున అనుత్తమమగు సిద్ధినిపొందెను. క్షమ యను నది అనాయాసముగలభించు పుణ్యతీర్థము; ద్రవ్య వ్యయాడంబరము లేని యజ్ఞము; దేహమును శోషింపజేయని తపస్సు. ఎవరి హృదయమున క్షమయను తీగ మొలచి ఫలించునో, వారు పుణ్యమునకును, కీర్తికిని పాత్రులగుదురు.



"ఇక ధైర్యపారమితను చెప్పెద, వినుము. పూర్వము దక్షిణాపథమున మాలాధరుడను బ్రాహ్మణకుమారుడుండెను. అతడొకనాడు ఆకాశమున బోవుచున్న సిద్ధకుమారుని చూచెను, అతనికి ఆకాశమున నెగురవలెనను నుత్సాహము కలిగెను. అంతట అతడు తాటిమట్టలతో రెక్కలుతీర్చి ఇరువైపుల కట్టుకొని ఎగురుటకు యత్నించుచుండెను. ఒకమారు వరదుడగు స్కందు డతనిని చూచి, "ఈ బ్రాహ్మణబాలకుడు మిగుల ధైర్యశాలి. పొందరాని పనినికూడ విడువక ప్రయత్నించుచున్నాడు. వీనికి గగనగమనము సిద్ధించునట్లనుగ్రహింతును." అని తలచి, అతనికి వ్యోమగమనశక్తిని ప్రసాదించెను. ఉత్సాహధైర్యములకు స్వయముగా సిద్ధికలుగును. ధర్మవీరమున నుత్సాహము సత్త్వమహాతరువునకు పాదువంటిది.

"ధ్యానపారమితను నుడివెద, వినుము. కర్ణాటదేశమున మలయమాలియను వణిక్పుంగవు డుండెను. అతడొకమారు ఇందు కేసరభూపతి కుమార్తె ఇందుయశ యను దానిని చూచెను. ఆమెను పెండ్లాడవలెనని అతనికి ఆశ కలిగెను. కాని, ఆమె దుర్లభ అని తెలిసికొని, చిత్రకారునితో ఆమె చిత్తరువొకటి వ్రాయించి పూజామందిరమున నుంచి నిత్యము పూజించుచుండెను. ఇట్లతడు సర్వవ్యాపారములు వదలి, తదేక ధ్యానపరాయణుడై గడుపుచు, ఒకనాడు

చిత్రపటముతోపాటు తన యుద్యానవనమునకు పోయి, చిత్రపటమును ఒక చెట్టుక్రింద పెట్టి, దానిపూజకై పూవులు తేబోయెను. అప్పుడు అచటికివచ్చిన వినయద్యుతియను బౌద్ధభిక్షువు వణిక్ శ్రేష్ఠుని చర్యను చూచుచు, అతడు పూవులకై పోయినప్పుడు, ఆ పటమున రాజకుమారి చిత్రము క్రింద పాము బొమ్మను గీసి ఏమిజరుగునో చూతమని మరుగున నుండెను. మలయమాలి పూవులుకోసికొని వచ్చి, పటములో పామును చూచెను. తన సుందరిని ఆపాము కరచినట్లును, ఆమె ప్రాణములువీడి భూమిపై ఒరిగినట్లును అతనికి భ్రాంతి కలిగెను. "హా! ప్రియా! నామానస సముద్ర చంద్రికా! ఎక్కడకు పోయితివి?" అని అతడు విలపించుచు ఒక చెట్టెక్కి ప్రాణత్యాగమునకై క్రిందికురికెను. ఇంతలో బౌద్ధభిక్షువు చాటునుండి వచ్చి, అతనిని పడనీక పట్టుకొని రక్షించి, ఓదార్చి ఇట్లనెను:— "వణిక్పుంగవా, ఎంతమూర్ఖుడవు! నీవు కోరిన రాజకుమారి అంతఃపురమున సుఖమున నున్నది. ఈ పటములోనిది నిర్జీవమగు బొమ్మ. అసత్యభావనామాత్రముననే నీకింతటి రాగముకలిగినది. తత్త్వజ్ఞానమున నిట్టి అనన్యమనస్కత కలిగిన నెంతటిసిద్ధి కలుగునో ఆలోచింపుము" అని యుపదేశించెను. అతడును బౌద్ధభిక్షువుమాటలు విని, ఇచ్ఛాభయద్వేషములు వదలి పరమశాంతుడై తత్త్వమునెరిగి సిద్ధుడాయెను. పిదప ఒకమారు అతడు



అంతఃపురమున రాజకుమారియగు ఇందుయశను ప్రత్యక్షముగ చూచెను, అంతయు మాయయను జ్ఞానము కలిగియుండుటచే అతడు వికారము పొందలేదు. పిదప అతడు ఇందు కేసర మహారాజునకు ఉపదేశమొసగి సద్గతులు కలిగించెను. ఇట్లు ధ్యానయోగముచేత భావింప బడినదంతయును కన్నులకు గనిపించును. ఇది ధ్యానపారమిత.

ఇక ప్రజ్ఞాపారమితను వివరించెద, వినుము. "సింహళ ద్వీపమున సింహవిక్రముడను దొంగ యుండెను. ముసలివాడయిన పిదప అతనికి నరకభయము పుట్టెను. "ఈ లోకమున ఎవరికంటను బడకుండ గడపితిని. పరలోకమున నెట్లు సేయుదును? ఎవరిని ఆశ్రయింతును? శివుడు విష్ణువు ఇంద్రుడు మొదలగు దేవతలకు పెక్కురు భక్తులుందురు గనుక నాభక్తిని గణింపరు. కనుక చిత్రగుప్తుని పూజింతును." అని నిశ్చయించి చిత్రగుప్తునిపూజించి తత్ప్రీతికై దానధర్మములు చేయ నారంభించెను. లీలాకమలపు కదలికలవంటి లిపులను వ్రాయుచు జగములనే తారుమారుచేయు కాయస్థులకు నమస్కరింపని వాడెవడు? చిత్రగుప్తుడు అతని భక్తికిమెచ్చి, అతనిని పరీక్షించుటకు బ్రాహ్మణవేషమున నతనియొద్దకువచ్చి పెక్కురీతుల అతనిని పరీక్షించి అతనిదృఢభక్తికి సంతుష్టుడై నిజరూపమును అతనికి తెలిపి వరముంకోరుకొమ్మనెను. సింహవిక్రముడు ఆనందముతో

"స్వామీ, నాకు దీర్ఘాయుస్సును ఇందు, మరణమును తప్పింపుడు" అని కోరెను. అందులకు చిత్రగుప్తుడు "నాయనా క్షీణించిన ఆయువు మరలిరాదు. మరణమును తప్పించుటకు నాకు శక్తిలేదు. అయినను నీకొక యుక్తితో దీర్ఘాయువు కలుగునట్లు చేయుదును. సముద్రమునకు ఆవల శ్వేతకేతువను రాజర్షి ఆశ్రమమున్నది. ఆ ఆశ్రమ ప్రాంతమున తరంగిణీయను ఒక నదియున్నది. నీవు ఆ ఆశ్రమమునకు పొమ్ము. అట నీకు మృత్యువుసోకదు. నీవు ఆనదినిదాటి ఈవలకు రాగూడదు." అని యుపాయము చెప్పెను. సింహవిక్రముడును ఆ ఆశ్రమముచేరి కాలుడు మనసులోనైన తలపని రీతిగా చిరాయువుగా నుండెను. ఇట్లు వెయ్యేండ్లు గడచెను. కాలుడు అతనిని ఎట్లయినను గొనిపోవుటకై తరంగిణీ ఆవలి గట్టును వేచియుండి, తనమాయతో దివ్యాంగన నొకదానిని సృష్టించి, సింహవిక్రముని యొద్దకు పంపెను. అతడు మోసపోయి ఆమెవెంట నదిదాటి యీవలకు వచ్చెను. ఆ యదనులో కాలుడతనిని పట్టి పాశములతో కట్టివేసి యమలోకమునకు లాగుకొనిపోయెను. చిత్రగుప్తుడు సింహవిక్రముడు మోసపోయి కాలవశుడగుట గ్రహించి, తన భక్తుని కాపాడ దలచి రహస్యముగా నతనితో నిట్లనెను :— "నిన్ను యమధర్మరాజు పిలిచి ముందుగా నరకమనుభవించెదవా, స్వర్గమనుభవించెదవా యని ప్రశ్నించును. స్వర్గమునకే పోవుదు



నని చెప్పుము. స్వర్గమునకు పోయినపిదప, తపమాచరించి స్వర్గవాసము శాశ్వతమగునట్లు యత్నింపుము". ఇంతలో యమధర్మరాజు చిత్రగుప్తుని పిలచి "ఏమోయి, ఈ గజదొంగకు పుణ్యాంశము ఇంచుకైనను కలదో లేదో తెలుపుము" అని ఉత్తర్వుచేసెను "దేవా, వీనిసంఖ్య మొదట నరకములేదు. ఇతడు వృద్ధాప్యమున సత్కర్మలు చేయుట వలన నితనికి స్వర్గవాసమే మొదటనున్నది. ఈ దుర్మతిని మొదట స్వర్గమునకే పోనిందు" అని చిత్రగుప్తుడు సమాధానము చెప్పెను. యముడు సింహవిక్రముని స్వర్గమునకు పంపెను. స్వర్గమున నతడు శివార్చనాపరుడై పాపములన్నియు దహించుకొనిపోగా, శాశ్వత సద్గతి పొందెను. ప్రజ్ఞావంతుడగు నాచోరుడు ఈ విధముగ కుశల స్థితిని పొందెను. మానవునికి ప్రజ్ఞకు మించిన బంధువు లేదు." ఇట్లు వినీతమతివలన సోమాశ్రముడు పారమితలను విని, విరాగుడై ఆ తపోవనముననే వినీతమతికి శిష్యుడై గడపసాగెను.

ఇట్లు కొంత కాలము గడువగా, అట వినీతమతి రాజ్యముపైనను ఇందుకలశుడు దండెత్తి వినీతమతి యిచ్చిన వరఖడ్గాశ్వముల ప్రభావమున కనకకలశుని జయించి, అతనిని సపరివారముగా తరిమెను. వారు దైవయోగమున వినీతమతి ఆశ్రమము చేరిరి వినీతమతి యుపదేశమున ఇందు

కలశుడు కనక కలశుని రాజ్యమతనికి తిరిగియిచ్చెను. అందరును సుఖముగా నుండిరి.

"కుమారా, ఇట్లు దైవానుగ్రహమున వారందరును కలసికొనిరి. నీవు ప్రాణత్యాగ ప్రయత్నము మానుము. తప్పక నీవు మృగాంకదత్తుని కలిసికొందువు" అని వృద్ధ తాపసి చెప్పగా, ప్రాణత్యాగ ప్రయత్నము మానుకొని, ఆమె నుండి సెలవుగైకొని, దక్షిణాభిముఖుడనై బయలు వెడలితిని. మార్గమధ్యమున ఈ అడవిని చేరితిని. శబరులు నన్ను దుర్గా దేవికి బలినీయదలచి పట్టుకొనిరి. నేను వారితో పోరాడి, పలువురిని చంపి, గాయములు తగిలి, సొమ్మసిల్లి పడిపోయితిని. వీరు నన్ను తమరాజు కడకు తెచ్చిరి. నా సుకృతమువలన నీ పాదసన్నిధి చేరితిని."

గుణాకరుడు తన వృత్తాంతమిట్లు చెప్పగా, మృగాంక దత్తుడు విని మిత్రసమాగమమునకు సంతసించి, అతనికి చికిత్స చేయించి, కొంతకాల మట గడపెను.

---

# 5
# యక్ష వృత్తాంతము

"అనంతరము మృగాంకదత్తుడు, తనకు సమయమున సహాయము చేయుటకు దుర్గపిశాచుని పంపునట్లు శబర రాజగు మాయాపటునికోరి, అతనినుండి సెలవు తీసికొని సకల గురు మిత్రులతోను ఉజ్జయినికి బయలుదేరెను. దారిలో వారందరును తమాలతాలహింతాలాది మహావృక్షములతో అవనికి వేణివలెనుండు వింధ్యారణ్యమున ఒకనాడు ఒక చెట్టు క్రింద నిద్రించిరి. ఉదయము అందరును నిద్రనుండి మేల్కాంచి చూడగా, వారి ప్రక్కన మరియొక పాంథుడు దీర్ఘ మార్గాయాసముతో బడలినట్లు ముసుగుకప్పుకొని పరుండియుండెను. అతడు ఎంతసేపటికి మేల్కాననందున మృగాంకదత్తుడు అతని ముసుగును ఇంచుక తొలగించిచూచెను. ఏమియాశ్చ ర్యము! అతడు తన మంత్రియగు చిత్రకథుడే! అతనినిచూచి మృగాంకదత్తునికిని, తక్కిన మిత్రులకును అమృతము త్రాగి నంత సంతృప్తికలిగెను. ఇంతలో చిత్రకథుడు మేల్కాంచి రాజకుమారుని తన మిత్రులను చూచి ఆనందభరితుడై లేచి అందరిని గాఢాలింగనము చేసికొనెను. మృగాంకదత్తుడు

తన వృత్తాంతమును, మిత్రుల వార్తలను తెలిపెను చిత్రకథుడు నిజోదంత మిట్లు చెప్పెను :—

## చిత్రకథాఖ్యాయిక

"మిత్రులారా, అప్పుడు, నాగరాజు శాపము వలన నేను దూరమున ఎచటనో పడితిని. మూర్ఛతేరి చూచు నప్పటికి మణులతో ధగధగలాడు కాంచన మందిరములుగల పట్టణములో నుంటిని. రత్నభూషణ భూషితుడగు దివ్య పురుషు డొకడు ఇరువురు భార్యలతో నా యొద్దకు వచ్చి, నా వృత్తాంతమడిగి, నన్ను సమాధానపరచి, ఇంటికి తోడ్కొని పోయి స్నానము చేయించి దివ్య భోజనము పెట్టించి సత్కరించెను. అతని భార్యలను అడిగి, అతడు యక్షనాయకుడని తెలిసికొంటిని. కొంతసేపు విశ్రమించిన తర్వాత, నేను యక్ష నాయకుని చేరి "వియోగ వ్యాధికి మందు కలదా?" అని అడిగితిని. అతడు శాస్త్ర చక్షువు గనుక, అన్ని శాస్త్రములను అవలోకించి, "మిత్రుడా, ఈ మానవజన్మలో ఎడబాటు కలయిక అనునవి గాలికి ఎగురు దూది పింజలవలె చేరుచు, విడిపోవుచు నుండునట్టివి. కనుక నీకు తప్పక మిత్రసమాగమము కలుగును. వియోగమే ప్రధానమగు ఈ ప్రపంచమున మందులేని వ్యాధి ఇష్టులగు వారియందు ప్రేమయే. అతి చంచలములగు సంయోగ వియోగములను తరంగములలో మును



గని వా డెవ్వడు? తేలని వాడెవ్వడు? అందువలన నీవు తప్పక మిత్రులను చేరుదువు. నాగశాపము తీరును, యక్షుడ నగు నేను పూర్వము మనుష్య జన్మలో సుదుస్సహమగు సుఖదుఃఖానుభవము పొందితిని. దానిని వివరించెదను వినుము.

## శ్రీదర్శనాఖ్యాయిక

త్రిగర్త దేశమున పవిత్రధనుడను బ్రాహ్మణు డుండెను. అతడు నిర్ధనుడగుటవలన యక్షిణీ మంత్రమును సాధించి ధనవంతుడు కాదలచి, ఒక యడవికి పోయి మంత్రబలముచే ఒక యక్షిణిని సాధించెను. ఆమె పేరు సౌదామని. ఆమె అతనికి వశురాలై అతనికి భార్య యయ్యెను. ఆమె వల్ల అతనికి విపులమగు సంపద కలిగెను. కాని పుత్రులు కలుగలేదు. అతడు తన ఈ కొరతను భార్యతో చెప్పెను. పుణ్యములకు ఫలము సత్సంతానమే గదా! భర్త మాటలు విని సౌదామని యిట్లు చెప్పెను.

"పూర్వము కారుమబ్బుల గుంపువంటి తమాల వనముండెను. దానిలో పృథూదరుడను యక్షుడుండెను. నేను అతని కుమార్తెనగు సౌదామనిని. నీవు అప్పుడు అట్టహాసుడవను సుందర యక్షకుమారుడవు. నేను ఒకమారు నా తండ్రితో పాటు కైలాసమునకు వచ్చితిని. అచట నీవు దీప్తశిఖు

డను నీ తమ్మునితో ఆటలాడుచుంటివి. నేను నిన్ను చూచితిని. నీవు నన్ను చూచితివి. పరస్పరము అనురాగము కలిగెను. నా తండ్రి వృషూదరుడు అనురూపదాంపత్యమనితలచి ఇరువురికివి వివాహముచేయ నిశ్చయించెను.

"ఇంతలో నొక యవాంతర మేర్పడెను. నీవు నీతమ్మునితోను. ఇరుగు పొరుగు యక్ష కుమారులతోను కలసి కుబేరుని యాట లాడితివి. నీవు కుబేరుడుగాను, నీ తమ్ముడగు దీప్తశిఖుడనువాడు నలకూబరుడుగాను, తక్కినవారు పరిజనముగాను ఆట కొనసాగుచుండెను. ఈ యాట ఆకాశ మార్గమున నెటకో పోవుచున్న నలకూబరుని కంట బడెను. అతడు మిగుల కోపించి "ఓరీ దుర్మార్గుడా, నీవుసామాన్యుడగు, యక్షుడవయి యుండియు, రాజువలెనటించి, పై పదవి ఆశించితివి. కనుక మర్త్యలోకమున పుట్టుము." అని శపించెను. అప్పుడు నీవు వినయముతో "దేవా" నేను చిన్న వయస్సువాడను, వినోదార్థము ఆటలాడితినేకాని ప్రభువు కావలయునను అభిలాషతోకాదు." అని ప్రార్థించితిని. నలకూబరుడు కనికరించి, తన దివ్యశక్తిచే నిజము గ్రహించి, యిట్లనెను. "నా శాపమునకు తిరుగులేదు. నీవు భూలోకమున నీ ప్రియురాలగు సౌదామనితో కొంతకాలముగడిపి, నీ తమ్ముడగు దీప్తశిఖుని కుమారునిగా పడసి శాప మోక్షముపొందగలవు" ఆ శాపము వలననే నీ కీ మానవ



రూపము కలిగినది. నీ వృత్తాంతము నేను నా సఖుల వలన, తెలిసికొని, నీ శరణు పొందితిని. త్వరలో నీకు కుమారుడు కలిగి శాపవిమోచనము కలుగును."

పూర్వజన్మ వృత్తాంతజ్ఞురాలగు సౌదామని యిట్లు చెప్పగా పవిత్రధనుడు సంతోషించి నిశ్చింతగా నుండెను. కాలక్రమమున వారికి కుమారుడు కలిగెను. పవిత్రధనునికి శాపముగూడ తీరెను. అతడు అట్టహాస యక్షుడుగా మారి పోయెను. పిదపకొన్నాళ్ళకు అట్టహాసుడు భార్యతో నిట్లనెను. "సౌదామనీ, ఈ పట్టణమున దేవదర్శనుడను బీద బాపడున్నాడు. అతనికి మనపుత్రుని అప్పగింతము. అతడును, అతని భార్యయును మనపుత్రుని మిగుల ప్రీతితో పెంతురు.

భర్త మాటలకు యక్షిణి అంగీకరించెను వారిరువురును తమపాపని హేమ రత్నాభరణములతో అలంకరించి ఒకనాటిరాత్రి ఎవరికిని తెలియక ఆ విప్రునింట వదలి, అతని ప్రక్కన నొక బంగారు నాణెముల కుండను పెట్టి కైలాసమునకు బోయిరి.

తెల్లవారగనే దేవదర్శనుడు మేల్కొని సర్వాభరణ భూషితుడగు బాలకుని చూచి ఆశ్చర్యపడి సంతోషము పట్టజాలక భార్యను మేల్కొల్పి బాలకునిచూపెను. అగ్ని దేవుని వరమువలన ధనముతో సహా తమ కీ బాలుడు

లభించెనని వారానందించి అతనికి శ్రీదర్శనుడను పేరు పెట్టి పెంచసాగిరి.

శ్రీదర్శనుడు కాలక్రమమున సర్వ విద్యలను, సర్వ కళలను నేర్చెను; శస్త్రాస్త్ర యుద్ధ కౌశలమును సంపాదించెను. దేవదర్శనుడు తీర్థయాత్రకుపోయి స్వపుణ్యవశమున త్రివేణీ సంగమమున మరణించెను అతని యిల్లాలు దుఃఖముతో అగ్ని ప్రవేశముచేసి మరణించెను. శ్రీదర్శనుడు ఈ విధముగ దగ్గరి బంధువు లెవరును లేనివాడాయెను. అన్ని విద్యలు నేర్చిన వాడయినను ద్యూత వ్యసనమున తగుల్కొనెను. జూదమువలన అతని సంపదయంతయు కరగిపోయెను. అతడు దుమ్ముకొట్టిన శరీరముతో, కట్టుకొనుటకు గుడ్డలు లేక, తలక్రింద భుజమును తలగడగా పెట్టుకొని నేలమీద పడియుండు జూదగాండ్రతోపాటు అతడును వారివలెనే తిండి లేక నా యను వారు లేక మాట పలుకలేక యోగివలె నిశ్చల ధ్యానమున దేనినో యోచించుచు గడుపుచుండెను. తుద కతనికి "ఛీ ఈ జన్మమేల ? మరణించుటలెస్స !" యను సంతాపము కలిగెను.

అప్పుడు ముఖరుడను అతని మిత్రుడు అతనితో నిట్లనెను. "ఆహా ! నీ కెంత వ్యామోహము ! నీవు ధీరుడవు, విద్వాంసుడవు, వివేకవంతుడవు. నీకు కూడ ఈ లాటి హృదయ భ్రమమా? ధనము లేదనికదా నీవు శరీర త్యాగము చేయ



దలచితివి. భావి కల్యాణ సంపదలకు ఈ దేహమేకదా ఆల వాలము, త్రివర్గ సాధనమగు ఈ శరీరముతో దేనిని సాధింప లేము ! సకలార్థ సిద్ధి రత్నములకును ఈ దేహము క్రయ విక్రయ భూమి. కనుక దేహమున్ననే ఎన్ని కోరిక లయినను పడయవచ్చును. దీనికి నిదర్శనముగా నొక కథ చెప్పెద వినుము."

"మోక్షలక్ష్మికి హార మనదగినట్టి వితస్తయను నది యున్నది. ఆ నది నిరంతరము నాట్యమాడు తరంగములతో పాపములను బెదరించుచున్నదా యనునట్లు తోచును. ఆ నదీ తీరమున కాశ్మీరమను మండలము కలదు. అక్కడి స్త్రీలు మిగుల సుందరులు. వారి చెక్కుటద్దములలో చంద్రుడు ప్రతిబింబించి, సౌందర్యమును అవహరించుచుండును. అక్కడ సూర్యుడు తన కరకు కిరణములతో ప్రజలను బాధింపడు. అక్కడి కవుల నాలుకపై సరస్వతీ నాట్యమాడు నట్లుండును, ఆ మండలమును భూనందను డను భూపతి యేలుచుండెను, అతడు భూమికి భూషణమువంటివాడు. కర్పూరము వలె తెల్లని శరీచ్ఛాయతో, శేషునివంటి బాహువులతో నందరను ఆకర్షించుచు ప్రజారంజకుడై యుండెను.

అత డొకమారు ద్వాదశినాడు రాత్రి ఉపవసించి నిద్ర పోయెను. స్వప్నమున అతడు సుందరియగు అసుర కన్యకను చూచెను, మేల్కొన్న పిదప ఆమెను వివాహమాడవలెనని

అతనికి ఆశ కలిగెను. అతనికి సదా సర్వకాలమును ఆ అసుర కన్యక ధ్యానమే యగుటవలన మంత్రులు చింతింప సాగిరి. పిదప నతడు మంత్రులతో నాలోచించి తమ్ముడగు వసునందునకు రాజ్యమప్పగించి శోకనాశిని యగు విశోక యను క్షేత్రమునకు పోయి తపమాచరించెను. విశోకా క్షేత్రమున క్రమసారమను సరోవరము కలదు. త్రివిక్రముడు బలిని జయించుటకై పాదమూనినందున అచట ఆ సరోవర మేర్పడెను. బలి జయమునకు సాక్షీభూతులగు బ్రహ్మ విష్ణు రుద్రులు ముగ్గురును పర్వతరూపులై పోయిరి. ఈ క్రమ సార సరోవరమునుండియే విష్ణువతియను గంగానది ప్రభవించెను. అతడు అట్టి పవిత్ర ప్రదేశమున తప మాచరింప సాగెను;

ఇట్లుండగా, ఒకానొకనాడు, అతని యొద్దకు సాక్షాత్శంకరునివలెనున్న ఒక తపస్వి వచ్చెను. అతడు భూనందను డడుగగా తన వృత్తాంతమిట్లు చెప్పెను ;— "రాజా, నేను దక్షిణాపథవాసిని. యజుస్సు అనువారు నా తండ్రి గారు. నా పేరు విభూతివసువు. శివాగమములలో ఆరితేరి ఆచార్య పదవి పొందితిని. నేనొకమారు శ్రీ పర్వతమున తప మొనరించితిని. ఉమాపతి సాక్షాత్కరించి యిట్లానతిచ్చెను : విభూతివసూ, పూర్వము బాణాసురుని కుమార్తెయగు ఉష అనిరుద్ధుని పెండ్లాడదలచి అతనిని మయనిర్మితమగు పాతాళ



వనమునకు తీసికొని పోయెను. పుత్రవత్సలుడగు ప్రద్యుమ్నుడు తన కుమారుని కానక ఆశ్చర్యపడుచు "తండ్రీ అనిరుద్ధ డెక్కడ ?" అని కృష్ణు నడిగెను "పుత్రా, అనిరుద్ధుడు ఉషతో పాతాళవనములో నున్నాడు. ఆ పాతాళ వనమునకు కాశ్మీర దేశమున రెండు బిల మార్గములున్నవి ; ఒకటి వితస్తానదిలోను, మరియొకటి ప్రకటముగా భూమియందును గలదు. ఆ భూమి బిలమార్గమును కాపాడుటకు ఏర్పాటు చేయుము." అని కృష్ణుడు ప్రద్యుమ్నునితో ననెను. ప్రద్యుమ్నుడును తండ్రిమాట మేరకు భూమి బిలద్వారమును ఒక గిరి శృంగముతో మూసి గౌరీదేవిని స్తోత్రము చేసెను. గౌరీదేవి సంతుష్టురాలై శారికారూపిణియయి అతనికి సహాయభూతురాలాయెను. కాలక్రమమున ముని శాపము వలన యాదవులు నశించిరి. ఉషాదేవి తన చెలికత్తెలతో పాతాళ వనమును చేరెను. ఆ బిల ద్వారమున్నచోట నేడు ప్రద్యుమ్న శిఖరమనియు, శారికా కూటమనియు రెండు శిఖరములు వెలసినవి. నీవు ఆ పాతాళ వనమునకు పొమ్ము. నీకు సకల సిద్ధులును కలుగును. పిదప నీవు నన్ను చేరుదువు." ఇట్లు ఆనతిచ్చి శివుడు నాకు విపుల సిద్ధుల నొసంగెను. నేను ఐదుగురు శిష్యులతో పాతాళ వనమును ప్రవేశింప దలచితిని. రాజేంద్రా, నీ ఈప్సితమును తెలిసికొంటిని. నీవు కలలో చూచిన అసుర కన్యక పాతాళవనమున నున్నది. నీవును మా వెంట రమ్ము."

విభూతి వసువు ఇట్లు చెప్పి భూనందనునితోపాటు శారికా కూటమునకు పోయెను. అట వితస్తానదీ జలములలో అందరును స్నానమొనర్చి, శారికాదేవిని పూజించిరి. విభూతి వసువు మంత్రపు ఆవాలు చల్లెను. వాని మహిమ వలన వితస్తానదిలోని ద్వారము తెరచుకొనెను. అందరును ఆ ద్వారమున ప్రవేశించి, ఐదునాళ్లు పయనించి, ఆదిశేషుని శరీరము వలె ధవళమగు పాతాళగంగను చూచిరి. అట వారు స్నానమాచరించి సేదదేరి మరికొంత దూరము పోగా, ఒక వెండి సరోవరమును చూచిరి. దానిలో బంగారు తామర పూవులు వికసించియుండెను. ఆ సరోవరము గట్లు రత్న వృక్షములతో అలంకృతమై యుండెను. ఆ చెట్లపై బంగారు పక్షులు కలకళారావములు చేయుచుండెను. దాని దాపుననే మేరు శిఖరమువంటి మందిర మొకటి యుండెను. అది హాటకేశ్వరాలయము. వారందరును హాటకేశ్వరుడగు శ్రీకంఠుని బంగారు తామర పూవులతో పూజించిరి. పిదప ముందుకు వెళ్ళుచు బంగారు కొమ్మలతో గొప్ప ఫలములతో నున్న ఒక పగడపు మానును చూచిరి. ఆ పగడపు మాను విఘ్న సంఘాతములతో నిలబడిన విఘ్నేశ్వరునివలె నుండెను. విభూతి వసువు ఆ పండ్లను తినవలదని శిష్యులను హెచ్చరించెను. అయినను చాపల్యముతో ఒక శిష్యుడు ఒక పండును రుచి చూచి వెంటనే స్థావర రూపము పొందెను. రెండవవాడు పండు



గనే మారిపోయెను. పిదప తక్కిన శిష్యులతోను, రాజుతోను విభూతివసువు ముందునకు సాగిపోగా, కనక ప్రాకారము, రత్న కవాటములుగల పట్టణ మొకటి కానవచ్చెను. ఆ రత్న కవాటమున కిరు వైపులను రెండు పొట్టేళ్ళు ద్వారపాలకులవలె నిలచియుండె, వారిని చూడగానే కుమ్ముటకు ముందునకురికివచ్చెను. విభూతివసువు తన మంత్ర దండముతో ఆ పొట్టేళ్ళను సంహరింపగా నందరును లోపల ప్రవేశించి రత్నాల గోడలలో చెక్కిన శిల్పములు, వైడూర్య స్తంభములు, బంగారు తోరణ గండ్లు మాణిక్యలతా పవనములు గల గొప్ప సౌధమునుచూచిరి. సౌధగోపురమునందు భటులు సాయుధులై కావలియుండిరి. విభూతివసువు తన మంత్ర బలముచే విఘ్నములన్నింటిని పోగొట్టెను. వెంటనే, ఆసౌధ ద్వారము విడివడి, లోపలినుండి చేటికలు మంగళద్రవ్యములతో వచ్చి, ఎంతయో చనవుతో వారికి దారి చూపిరి. వారు సౌధమున ప్రవేశించిరి. అచ్చట వారికి అతి సుందరులగు అసుర కన్యలు కనిపించిరి. భూనందనుడు తనకు కలలో కానవచ్చిన అసురకన్యకనుచూచి విస్మితుడాయెను. ఆమెపేరు కుముదిని ?

ఆ అసురకన్యక అతనిని సమీపించి, "దేవా, నాకై చాల శ్రమపడితివి. క్షమింపుము. సత్పురుషులు అపరాధము చేసిన వారియెడలను అనుగ్రహ దృష్టితో నుందురుగదా ?"

అని చెప్పి, కనుసైగతోనే తన దాసికి ఏమియో ఆదేశించెను. ఇంగితజ్ఞురాలగు దాసి, అతనిని పానక్రీడకై సరోవరతీరమునకు గొనిపోయెను. ఆ సరోవర తీరముననున్న చెట్లపై పీనుగులు వ్రేలాడుచుండెను. సరోవరము రక్తముతో, క్రొవ్వుతోనిండి భయంకరముగ నుండెను. అసురకన్యక ఒక పాత్రను ఆ సరోవరమున ముంచి, భూనందనునకు అందించి, త్రాగుమని కోరెను. రాజు దాని దుర్గంధము భరింప జాలక త్రాగలేదు. "దీనిని త్రాగనిచో నీకు శ్రేయముకలుగదు" అని ఆమె బ్రతిమాలినను అతడు గ్రహింపడాయెను. ఆమె విసిగి, కోపగించి, ఆ రత్నపాత్రను అతనితలపై విసరికొట్టి వెడలిపోయెను. ఆమె దాసిగణము అతనిని మరియొక మంచినీటి సరోవరమున పడవేసిరి. అతడు క్రమసార సరస్సులో తేలెను. అతడు అంతయును స్వప్నమువలె తోచి, మిగుల శోకించెను. దైవము అనుగ్రహించిన ఫలమును ఉప్పుమని యూది, పోగొట్టుకొంటినే యని పశ్చాత్తాపము పొందెను.

అసురకన్యక విసరిన పానముచే తడిసిన అతని దేహమున గుమగుమలు బయలుదేరెను. ఆ పరిమళమునకు తుమ్మెదలు ముసరెను. అతడు చేతితో ఎంత విసరినను అవి వదలలేదు. అతని బాధను దారినిపోవుచున్న ఒక మునికుమారుడు చూచి, దయతో "రాజా, వైక్లబ్యము పొందకుము. నే నొక కృష్ణాజినమును ఇత్తును. దానిని కప్పికొనుము. తుమ్మెదల



బాధ తొలగును." అని చెప్పి, కృష్ణాజినము నిచ్చెను. పిదప అతని వృత్తాంతము అడిగి తెలిసికొని, "రాజా, నీవు కారణత్రయమగు బ్రహ్మోపేంద్ర త్రినేత్రులను సమభక్తితో ఆరాధింపక పోయితివి. అందువలననే నీకు విఘ్నము కలిగెను. నీవు త్రిమూర్తులను ఏకదృష్టితో ఆరాధింపుము, అసుర కన్యకను త్వరలో పొందగలవు." అని ఉపదేశించెను.

"భూనందనుడును అట్లే యొనర్చి, విఘ్నములులేక మరల పాతాళవనముచేరి, అసురకన్యకను వివాహమాడి సుఖముగ నుండెను. కావున చెలికాడా, శరీరములు బాగుగా నున్ననే మనోరథములు సిద్ధించును. శరీరము నశించిన నేమి సిద్ధించును ? అందువలన పరితపింపకుము. ఆత్మహత్యా ప్రయత్నము మానుము."

ముఖరకుని మాటలువిన్న శ్రీదర్శునికి ధైర్యము కలిగెను. మురికినీరు చిల్లగింజచే తేరునట్లు, మంచిబుద్ధి విని మనస్సు విమలమగును గదా ! పిదప శ్రీదర్శుడు ముఖరకుడు తెచ్చిన భోజనమును మితముగ భుజించి. అతనితో కూడ ఆరాత్రియందే ఎవ్వరికంటను పడక దేశాంతరమునకు పోయెను. మానము నశించి. ధనముపోయి. స్వజనులు శత్రువులయినప్పుడు స్వదేశమున నుండుట మానవులకు తగదు. అట్లుండుట విడంబనకు నిదర్శనము.

వారిరువురును ఇట్లు పోవుచుండగా, శ్రీదర్శనుని
శైశవముననే బ్రాహ్మణుని యింట వదలిపోయిన తలిదం
డ్రులు అట్టహాసుడును, అతని భార్య సౌదామనియును గగన
మార్గమున పోవుచు, తమ కుమారుని దీనావస్థను గనిరి. అట్ట
హాసుడు కనికరించి, అతనికి అగుపడక ఆకాశము నుండియే
"శ్రీదర్శనుడా" సమీపముననే మాళవ దేశమున్నది: దానిని
శ్రీ సేనుడను రాజు పాలించుచున్నాడు. అతడు చిన్నతన
మున ద్యూతవ్యసనము గలవాడు. కష్టములనుభవింపని వాడు
పరుల వ్యథలను ఎట్లు గుర్తించును? అతడు జూదమున పడ
రాని పాట్లు పడినవాడు గావున జూదగాండ్రకై పెద్ద మఠమును
గట్టించియున్నాడు. అచట జూదగాండ్రు కోరినవన్ని యు
నిత్తురు. నీ యింట నీ తల్లి దేవదర్శనునిభార్య భూమిలో పాతి
పెట్టిన రత్నభూషణములున్నవి. వానిని పాథేయముగా తీసికొని
మాళవ దేశమునకు పొమ్ము. నీకు శుభములు కలుగును" అని
పలికెను శ్రీదర్శనుడు ఆ మాటలు విని వాని నిజము తెలియ
గోరి, చెలికానితోగూడ ఇంటికి మరలెను. దారిలో పంటచేల
మధ్యనున్న ఒక గ్రామము చేరి, దప్పి తీర్చుకొనుటకై చెరువు
గట్టునకు పోయెను.

అతడు నీరు త్రాగి గట్టున విశ్రమించి యుండగా,
నీటికై యచటికొక కన్యక వచ్చెను. అతడు కుతూహల
ముతో "ఎవతెవు నీవు?" అని అడుగగా, ఆమె యిట్లు చెప్ప



సాగెను:— "ఆర్యా, నేను పద్మగర్భుడను బ్రాహ్మణుని
కుమార్తెను. నా పేరు పద్మిష్ఠ. నాకొక గుణవంతుడగు
అన్న యుండెను. అతనిపేరు ముఖరకుడు. అతడు జూదము
మరగి యిల్లు విడిచి యెటకో పోయెను. నా తండ్రి నాతో
కూడ అతనిని వెదకుచు వెదకుచు ఇటకు చేరెను. నిన్నరాత్రి
చోరనాయకుడగు వసుభూతియను బ్రాహ్మణబ్రువుడు నా తండ్రిని
చంపి, నన్ను తన యింట బంధించి, తన పుత్రునికిచ్చి బల
వంతముగ పెండ్లిచేయ దలచుచున్నాడు. అతడు ఒక వర్తకుల
బిడారమును దోచుకొనుటకు పోయినాడు. దొంగల రాజునకు
మీ సంగతి తెలిసిన మీ గతి యేమగునో! నా దుఃఖము
కన్నను, మీ కేమగునోయను తాపమే నన్ను మిగుల బాధిం
చుచున్నది."

ముఖరకుడు ఆమె మాటలువిని. ఆమెను తన సోద
రిగా గుర్తుపట్టి, తండ్రి మరణమునకు మిగుల శోకించెను.
శ్రీదర్శనుడు ఊరడింపగా, అతడు తన సోదరిని ఓదార్చెను.
పిదప ముగ్గురు దొంగల బారిపడక తప్పించుకొను నుపాయ
మాలోచించిరి. శ్రీదర్శనుడు మరణాసన్నునివలె నటింప
వలెను. ముఖరకుడు అతని సేవకునివలె నటింపవలెను.
పద్మిష్ఠ చోరనాయకునితో ఈ సంగతి చెప్పును. చోరనాయ
కుడు వారివద్దకు వచ్చినప్పుడు ముఖరకుడు, అతనితో,
"ఆర్యా, ఇతడు నా దొర; వ్యాధిగ్రస్తుడు. మరణించు

చున్నాడు. మా యొద్ద రత్న భూషణములున్నవి, ఈ రాత్రి మాకు ఆశ్రయమిండు. మా నగలను మీ వద్ద భద్రపరచుకొనియెదము. రేపటిసంగతి చూతము." అని దీనముగా పలుకును. పిదప తప్పించుకొను నుపాయము ఆలోచింపవచ్చును. ఈ రీతిగా వారు ఆలోచించి ప్రవర్తించిరి. అన్నియు అనుకొనినయట్లే జరిగెను. మరణాసన్నుడగువానినీ చంపుట యెందులకు? ధనమును రేపే తీసికొనవచ్చును — అని దొంగలనాయకుడు తలచి వారికి ఆరాత్రి తనయొద్ద విడిది కల్పించెను. వారిరువురును తమనగలతోను పద్మిష్టతో గూడను రాత్రియెట్లో తప్పించుకొని, అడవులబడి, దారిలో నొకచోట ఒకయక్షకాంతను ఇంత భిక్షమడిగి భుజించి, మాళవముచేరి, శ్రీసేనభూపాలుని రాజధానికేగి, ఒక పూటకూటి యవ్వయింట బసచేసిరి.

వారు ఆయవ్వతో తమ వృత్తాంతముచెప్పి, యక్కడి సంగతులు తెలుపుమని కోరిరి. ఆ యవ్వ వారినిచూచి దిగులుతో నిట్లనెను: — "నాయనలారా, శ్రీసేనమహారాజిపుడు క్షయవ్యాధితో బాధపడుచున్నాడు ఎందరు వైద్యులు, ఎందరు మంత్ర వేత్తలు చికిత్సచేసినను ఆ వ్యాధి కుదురుట లేదు! ఒక మంత్రధరుడువచ్చి, రెండవ సాధకుడు లేక సిద్ధి లేదనియు, మరియొక వీరుడు దొరికినయెడల, తాను బేతాళుని సాధించి, వ్యాధిమాన్పుదుననియు రాజుతో విన్న



వించెను. రాజు, "జూదగాండ్రమఠమున నెవ్వడైన శూరుడున్నాడేమో వెదకుడు. ధైర్యసాహసములకు జూదగాండ్రు నెలవు." అని ఉత్తరువు చేసెను. మీరు వీరులవలెనున్నారు. మఠాధిపతియొద్దకుపోయి, మిమ్ము తెలుపుకొనుడు. రాజునకు మేలుకలిగిన మీకు సత్కారము కలుగును."

అవ్వమాటలు శ్రీదర్శు డంగీకరించి ద్యూతమఠమునకు పోయెను. మఠాధిపతి అతనిని రాజునకు తెలియపరచెను. అతనిని చూడగానె శ్రీసేనమహారాజునకు తన పని నెరవేరునను నాశకలిగెను. మంత్రధరుని రావించి, శ్రీదర్శుని అతనికప్పగించి "మహాత్మా, ఈ వీరుడు నీకు బేతాళసాధనమునకు తోడ్పడును. ఇక నీవు మంత్రసాధన మొనర్చి నా వ్యాధికుదుర్పుము" అని ఆజ్ఞాపించెను. మంత్రధరుడు శ్రీదర్శుని తనవెంట పిలుచుకొనిపోయి, "వీరుడా, బేతాళుని సాధించుటకు తోడ్పడగల ధైర్యమున్నయెడల, ఈ రాత్రి నన్ను ఈ పట్టణపు వల్లకాటిలో కలిసికొనుము." అని చెప్పి రాజునొద్ద సెలవుగైకొని పోయెను.

శ్రీదర్శుడును మఠమునకు పోయి, ముఖరకునికిని, పద్మిష్ఠకును యావద్వృత్తాంతమును తెలిపి, విశ్రమించి రాత్రి కత్తిపట్టుకొని శ్మశానమున కేగెను. శ్మశానమున నతడు తిరుగుచు మంత్రధరుని వెదకికొని "నేను చేయవలసిన పని

యేమి? సెలవిండు." అని వేడుకొనెను. మంత్రధరుడు సంతుష్టుడై "ఇక్కడికి పడమట కొంతదూరమున శింశుపా వృక్ష మొకటియున్నది. దాని క్రిందనున్న శవమును భద్రముగా తీసికొని రమ్ము" అని అతనికి ఆజ్ఞాపించెను. శ్రీ దర్శనుడు సరేయని ఆ చెట్టువద్దకు పోగా, మరియొక సాధకుడు, ఆ శవమును మోసికొని పోవుచుండుట యగపడెను. అతడు వానిని ముందుకు త్రోసి, శవమును గట్టిగా పట్టుకొని లాగెను. ఆ సాధకుడును లాగెను. వీ రిరువురును లాగుచుండగా పీనుగు బేతాళావిష్టమై వికృతముగా నరచెను. ఆ యరపునకు రెండవ సాధకుడు భయపడి మరణించెను. శ్రీ దర్శనుడు ఆ శవమును మంత్రధరుని యొద్దకు మోసికొని పోయి, యాగస్థలమున పెట్టెను. మంత్ర ధరుడు మిగుల సంతోషించి, ఆ శవము ముఖమున మనుష్యుని ఎముకలతో చేసిన స్రుక్స్రువములతో హోమము చేయ దొడగెను. వెంటనే ఆ శవము నోటినుండి యగ్ని పుట్టి ప్రజ్వలించి, కుహ కహారవము బయలు వెడలెను. ఆ రవమునకు మంత్రధరుడు భయమంది స్రుక్స్రువములను జారవిడిచి పరుగిడెను. శవము వెంటనే మంత్రధరుని తరిమిపట్టి మ్రింగివేసెను. శ్రీ దర్శనుడు శవము బేతళావిష్టమయి యున్నదని గ్రహించి, కోపావిష్టుడై ఒరనుండి కత్తిదూసి, బేతాళుని చంపబోయెను. బేతాళుడు అతని ధైర్యమునకు మెచ్చి, "ఓయీ, నీ సాహసమునకు మెచ్చితిని. ఈ సిద్ధి పొందిన



ఆవాలు తీసికొనుము. వీనిని నూరి తలకు పట్టువేసిన మాత్రాన రాజు యక్ష్మరోగము శాంతించును. నీవును రాజవగుదువు." అని చెప్పెను. శ్రీదర్శనుడు వినయముతో బేతాళునికి నమస్కరించి "మంత్రధరుడు లేక నేను రాజు సన్నిధికి ఎట్లుపోదును? మంత్రధరుని నేనుచంపివేసితినని రాజు నన్ను అనుమానించి శిక్షింపడా?" అనెను. అందులకు బేతాళుడు, "నీవు భయపడకుము, నేను ఆవేశించిన ఈ శవము పొట్టచీల్చిచూపుము. లోపల మంత్రధరునిశవము కనిపించును. రాజాదులు నమ్మెదరు," అని చెప్పి అదృశ్యుడాయెను.

పిదప శ్రీదర్శనుడు జూవగాంద్ర మఠముచేరి, తెల్లవారగనే. కాల్యకృత్యములు ముగించి శ్రీ సేనుని యాస్థానమునకు పోయెను. రాత్రి జరిగిన వృత్తాంత మంతయును అతనికి నివేదించి, శవము కడుపుచీల్చి మంత్రధరుని చూపించి, నమ్మించి, సిద్ధిపొందిన ఆవాలునూరి రాజు తలకు పట్టువేసి, అతని వ్యాధిని పోగొట్టెను. రాజు మిక్కిలి ప్రీతి చెంది, సంతానము లేనివాడుగావున, తన రాజ్యమునకు తగిన సత్త్వ సాహసశాలి అతడే యని నిశ్చయించి, అతనిని పుత్రునిగా స్వీకరించి, యౌవరాజ్యపట్టము కట్టెను. శ్రీదర్శనుడు రాజ్యమునుపొంది, పద్మిష్ఠను పెండ్లాడి, ముఖరకుని మంత్రినిజేసి. రాజ్యమేలుచు సుఖముగా నుండెను.

## అనంగమంజర్యాఖ్యాయిక

ఇట్లుండగా ఒకమారు అపర కుబేరు డనదగిన ఉపేంద్ర శక్తియను వర్తకు డొకడు తన బిడారముతోపాటు ఆ నగరమునకు వచ్చెను. అతడు తనకు సముద్రపు తరగలలో దొరికిన ఒక బంగారు వినాయక విగ్రహమును శ్రీ దర్శన యువరాజునకు కానుకగానిచ్చెను. శ్రీ దర్శనుడు ఆ విగ్రహమును మంత్రజ్ఞులగు బ్రాహ్మణులతో విధిపూర్వకముగా రత్నఖచితమగు మందిరమున ప్రతిష్ఠించి, యాత్రా మహోత్సవములను చేయించెను. అతని శ్రద్ధా భక్తులకు గణనాయకుడు మెచ్చి, తన గణములతో నిట్లు పలికెను: "శ్రీ దర్శనుడు త్వరలో చక్రవర్తియగును. హంసద్వీపాధి నాథునితనయ అనంగమంజరి ఇతనికి నా వరమువలన భార్య యగును. మీరు ఇతనిని అనంగమంజరి ఇష్టపడునట్లు చేయుడు." గణనాయకుని ఆజ్ఞమేరకు గణపురుషులు తమ మాయతో రత్నపర్యంకసుప్తుడగు శ్రీ దర్శనుని ఆ రాత్రియే క్షణములో హంసద్వీపమున అనంగమంజరి యొద్దకు చేర్చి అతనిని మేల్కొల్పిరి.

శ్రీ దర్శనుడు మేల్కొని చుట్టుపట్లుచూచి ఆశ్చర్యపడెను. అది తన పడకటిల్లుకాదు. మరియొక లోకమువలె నుండెను. పందిరి పట్టెమంచముపై ఒక లోకోత్తరసుందరి



నిద్రించుచుండెను. శ్రీదర్శనునకు మరియును విస్మయమై, ఆమెను మేల్కొల్పి నిజము కనుగొనవలెనని నిశ్చయించి, అనంగమంజరిని మేల్కొల్పెను. ఆమె వెంటనే మేల్కొని అతనిని చూచి, సౌమ్యత యుట్టిపడు అతని ముఖముచూచి సౌందర్యమును, రాజవేషమును పరికించి, అతడు సత్పురుషుడని నిశ్చయించి, "ఎవరుమీరు? ఇక్కడికి వచ్చుటకు కారణమేమి? ఎట్లువచ్చితిరి?" అని ప్రశ్నించెను. శ్రీ దర్శనుడు తన వృత్తాంతము పూసగుచ్చినట్లు చెప్పెను. ఆమెయు తన పుట్టుపూర్వములు తెలిపెను. అది కలగాదనియు వాస్తవమే యనియు ఇరువురకును నమ్మకము కలిగెను. ఇరువురును వివాహమాడ నిశ్చయించి, ఉంగరములను మార్చుకొని సంభాషించుచు నిద్రపోయిరి. గణపురుషులు అతనిని హంసద్వీపము నుండి మరల మాళవ రాజధాని చేర్చిరి.

శ్రీదర్శనుడు ఉదయము మేల్కాంచిచూడగా, తన నగరున పడకటింటనే యున్నట్లు కనుగొని ఆశ్చర్యపడెను. చేతివ్రేలిని చూచుకొనగా, అనంగమంజరి పేరున్న రత్నాంగుళీయకముండెను. అతడది స్వప్నముగాదని నిశ్చయించుకొని, దైవమాయ కాబోలునని తలపోసి, శ్రీ సేనమహారాజుకడకుపోయి, యావద్వృత్తాంతము నివేదించెను. ఆతడు తన పెంపుడుకుమారుని ప్రీతికోసము "హంసద్వీపము

నకు దారి తెలిసినవారు రాజుగారి యాస్థానమునకు వచ్చి మనవిచేయవచ్చును" అని దండోరావేయించెను.

అచ్చట హంసద్వీపమున అనంగమంజరియును శ్రీదర్శనుడు పొందిన స్థితినే పొందెను. రాత్రి వృత్తాంత మంతయు తన తండ్రియగు అనంగోదయునికి తెలియజేసి. శ్రీదర్శనుని పేరున్న ఉంగరమును చూపెను. అతడు "ఉంగరముపై శ్రీదర్శనుడను పేరుండుట నిజమే. అయిన, అత డెచటనున్నాడో, ఏరాజవంశమువాడో తెలియుట యెట్లు? ఏమైనను బ్రహ్మసోమయోగీశ్వరునికడకు బోయి, అతని నడిగిన ప్రయోజనముండునేమో చూచెదను. అతడు త్రికాలవేది. యోగదృష్టిచే నంతయును ఎరుగగలవాడు." అని యోచించి, అతనియొద్దకుపోయి, ఏకాంతమున తన కుమార్తె అభిప్రాయమును తెలియజేసెను. ఆ యోగివరుడును తన మహిమతో సకలమును ఎరిగి "రాజా, ఈ ఉంగరము మాళవదేశ యువరాజగు శ్రీదర్శనునిది. అతనిని గణ పురుషులు రాత్రి యిచ్చటికితెచ్చి, మరల మాళవము చేర్చిరి. అతడు నీకుమారితకు అనురూపుడగు వరుడు. వెంటనే వివాహము వైభవముతో చేయింపుము" అనెను. అనంగోదయుడు మిగుల విస్మయముచెంది "ఆర్యా, హంసద్వీప మెక్కడ? మాళవమెక్కడ? అంతదూరము మరియొకరు పోయి కార్యముసాధించుట సాధ్యముకానిపని. తక్కిన సకల



కార్యములను మీ అనుగ్రహముననే సిద్ధించుచున్నవి. ఈ పనినికూడ మీరే చేసిపెట్టి, నాపుత్రిని అనుగ్రహింపుడు" అని వేడుకొనెను. ఆ యోగియును అతనియెడ దయగలవాడయి, ఖేచర విద్యను తెలిసినవాడు కావున గగనమార్గమున మాళవ రాజధానిచేరి, శ్రీదర్శనుడు నిర్మించిన వినాయకుని మందిర మున దిగి, అతనిని ప్రస్తుతించి విశ్రమించియుండెను.

అప్పుడచటి కొక పిచ్చివాడువచ్చి బ్రహ్మసోమ యోగిపై రాళ్ళు విసరసాగెను. యోగి అతని పిచ్చిని తన మంత్రబలముచే కుదిర్చి, స్వస్థుని చేసెను. పిచ్చివాడు ఆ విఘ్నేశ్వరవిగ్రహమును శ్రీసేనునికి బహూకరించిన ఉపేంద్రశక్తియను వర్తకుని కుమారుడు మహేంద్రశ. అతడు ఇంటికిపోగానే తలిదండ్రులు, బంధువులు ఆనందపడి, అతని వెంట బ్రహ్మసోమయోగికడకు వచ్చి, సత్కరించిరి. ఎవ్వడో దివ్యసిద్ధుడు విఘ్నేశ్వరాలయమున విడిసియున్నాడను వార్త నగరమంతట వ్యాపించి, శ్రీసేనుని చెవిబడెను. అతడువచ్చి యోగికి నమస్కరించి తనకుమారుని మనోరథముతెలిపి, హంసద్వీపమార్గము నడిగెను. యోగి చిరునగవుతో తాను హంసద్వీపవాసియగుట, అనంగోదయుని పనుపున వచ్చుట మొదలగునవి తెలిపి, రాజునకు నమ్మకముకలిగించి, తనవెంట శ్రీదర్శనుని హంసద్వీపమునకు పిలుచుకొనిపోయెను.

హంసద్వీపమున శ్రీదర్శునకును, అనంగమంజరికిని వివాహము కడువైభవముగా జరిగెను. శ్రీదర్శనుడు అనంగమంజరితోకూడ బ్రహ్మసోమయోగి ప్రభావమున మాళవదేశమునకు మరలివచ్చి సుఖముగానుండెను. కాలక్రమమున శ్రీసేనమహారాజు వృద్ధుడై తన రాజ్యమును అతనికి అప్పగింపగా, అతడు న్యాయముగ ప్రజలను పాలించుచు, పృథివిని జయించి, చక్రవర్తియాయెను. పిదప కొంతకాలమునకు శ్రీదర్శనుడు పద్మదర్శనుడు, అనంగదర్శనుడు అను తన యిరువురు పుత్రులకును రాజ్యమప్పగించి ఇరువురు భార్యలతో తపోవనమునకు పోయెను. అట కొంతకాలము వానప్రస్థుడైయుండి, యక్షరూపముపొంది, యక్షలోకముచేరెను.

"చిత్రకథకుడా, శ్రీదర్శనరాజయిన దీప్తశిఖుడను యక్షుడను నేనే వీరిరువురును అప్పటి రాణులు పద్మిష్ఠ, అనంగమంజరి యనువారు; జ్యోతిర్లేఖ ధూమలేఖ యను యక్షకన్యలు. అపారమగు ఈ సంసారమున ప్రాణులందరకును సుఖదుఃఖములు తప్పవు. విషాదము పొందకుము. మృగాంకదత్తునితో నీకు సమాగమము కలుగును."

"దేవా ఆయక్షనాయకుడిట్లు ఊరడించి ఉపచరింపగా కొన్నాళ్లు అతని భవనమున గడపితిని. మీ రిచటికి



వచ్చితిరని తెలిసి, యక్షనాయకుడు మీ రందరును నిద్రించుచుండగా నన్ను ఇచ్చటికి చేర్చెను."

చిత్రకథుని సంగతి విని మృగాంకదత్తుడును, అతని మిత్రులును పరమప్రీతిపొందిరి. వారందరును ఆనాడచ్చటనే గడపి, మరునాడు ఉజ్జయినికి పయనమైరి.

—oo◇◇oo—

# 6

# వారణరాజ వృత్తాంతము

—oo:o:oo—

మృగాంక దత్తాదులు దారిలో నొక కారడవిని చూచిరి. అది ఎత్తయిన తమాల తమాలతాది వృక్షములచే సూర్య బింబమును తాకుచు, ఇంద్రనీల శిలాస్తంభములతో చీకటి కొరకై కట్టిన మండపమువలె భయంకరముగ నుండెను. అచ్చట నొక పొదరింట ఎవరో సంభాషించుచున్నట్లు మాటలు వినబడెను. వారు తొంగిచూడగా, ఒక యేనుగు ఒక గ్రుడ్డివానికి తొండముతో ఫలములను అందించుచు, సంభాషించుచుండెను. మృగాంకదత్తుడు తన మిత్రులతో "ఆహా! ఏమి ఆశ్చర్యము! అపూర్వముగ నున్నదే! ఈ అంధుని ఏనుగు బంధువునువలె ఆదరించుచున్నది. ఈ గ్రుడ్డి వాడెవడు? మన మిత్రుడగు చండశక్తివలె నున్నాడే? అతడేనా? అయిన ఈ గ్రుడ్డితన మెందులకు?" అని పలికి, "ఈ సంభాషణమును మరుగుననుండి వినియెదము" అనెను. వారందరును మరియొక పొదచాటున పొంచియుండిరి.

అప్పుడు ఆ ఏనుగు ఆ గ్రుడ్డివానితో "నేను పూర్వ జన్మమున ఒక రాజపుత్రుడను. భ్రాతృవధకోసమై వ్రత



మాచరించి త్రినేత్రుని శాపమున ఏనుగునైతిని. మీ రెవరు? మీ గ్రుడ్డితనమునకు కారణమేమి? అని అడిగెను. అంధుడు బాష్పగద్గద స్వరముతో నిట్లు చెప్పెను. నేను మృగాంక దత్తుని పదవమంత్రిని. నా పేరు చండశక్తి. నాగరాజు శాపమున గ్రుడ్డివాడనైతిని. నీ వృత్తాంతము సవిస్తరముగ చెప్పుము. నీవును శాపవశమున ఏనుగురూపము ధరించిన దురదృష్టవంతుడనని తలంతును" అనెను.

మృగాంకదత్తుడు మంత్రులతో "మిత్రులారా, ఇతడు చండశక్తియే. అయ్యో! ఎంతకష్టములపాలయినాడు! మన మిప్పుడే అతనియొద్దకుపోయిన మేలేయగునో, కీడే యగునో, మనము ఏనుగు పలుకులను పూర్తిగా వినినపిదప కర్తవ్యము ఆలోచింతము. ఇంతలో కలుగు ప్రమాద మేమియులేదు." అనెను. ఏనుగు సవిస్తరముగా తనవృత్తాంతము చెప్పదొడగెను.

## భీమభటాఖ్యాయిక

"రాఢ యను నగరము రాజధానిగా ఉగ్రభటుడను రాజు రాజ్యమేలుచుండెను. అతనికి పేరుకుతగినట్లు మనోరమ యను రాణియుండెను. ఒకనాడు కాలకుడను నట్టువకాడొకడు ఆ రాజాస్థానమునకువచ్చి, అమృతాహరమను నాటకమును ఆడెను. ఆ నర్తకుని కుమార్తె దాసిక యనునది

ఆ నాటకమున మోహినీవేషము వేసెను. రాజు ఆమె రూపమునకును, అభినయచాతుర్యమునకును ప్రీతుడై, ఆమెతండ్రియగు కాలకునికి ఏకాళముగ ధనమిచ్చి, ఆమెను వివాహమాడెను. అతనికి పుత్రకామేష్టివలన మనోరమయందు భీమభటుడను పుత్రుడును, నర్తకియగు దాసికయందు సమరభటుడను పుత్రుడును కలిగిరి. వారిరువురును పెరిగి పెద్దవారైరి. కళలయందును, శస్త్రవిద్యయందును భీమభటుడు అధికుడు. అయినను రాజు దాసికపైనున్న ప్రీత్యతిశయముచే సమరభటుని మక్కువ యాదరించుచుండెను.

ఒకమారు అన్నదమ్ము లిరువురును వినోదమునకై యుద్ధము చేయుచుండగా, భీమభటుని ఆయుధముతో సమరభటుని తలకు గాయము తగిలెను. రక్తసిక్తు డగు తనకుమారుని దాసిక రాజువద్దకు కొనిపోయి, భీమభటునిపై కొండెములు చెప్పెను. ఉగ్రభటుడు కోపగించి, భీమభటుని శిక్షించి దూరముననుంచి, సమరభటునికి కొందరు రాజకుమారులను తోడుగా చేసెను. సమరభటుడు తండ్రిబలము చూచుకొని అన్నను అవమానించుచుండెను. వారిరువురకును మిత్రుడగు శంఖదత్తుడను బ్రాహ్మణకుమారుడు సమరభటుని యొద్దకు పోయి, అన్నతో వైరము తగదని హితవు చెప్పెను. సమరభటుడా మాటలువినక, అతనినిగూడ అవమానించిపంపెను.



శంఖదత్తుడు పగబూని, సమరభటుని జయించుటకై భీమభటునితో చేరెను.

ఒకమారు మణిదత్తు డను వర్తకుడు దేశాంతరమునుండి ఒక గుఱ్ఱమును తెచ్చి అమ్మజూపెను. అది సంకల్పమువలె శీఘ్రముగా పరువెత్తునది. సూర్యమండలమునుండి దిగివచ్చినదా యన్నంత తేజోవంతముగ నుండెను. పాలకడలివలె తెల్లగ నుండెను. దానిని భీమభటుడు వర్తకుని యొద్ద వెలయిచ్చికొనెను. సమరభటుడు దర్పాంధుడై దానిని అపహరించుకొని వచ్చుటకు భటులతో వచ్చెను. భీమభటుడు శంఖదత్తుని సాహాయ్యముతో సమరభటుని సేవకులను చంపి, సమరభటుని గాయపరచెను. భీమభటుని తల్లి మనోరమ ఈ సంగతి యెరిగి రాజిది తెలిసిన భీమభటుని చంపునని భయపడి, తన రత్నభూషణములను, వలసినంత ధనమును ఇచ్చి, అతనిని మాతామహుని యింటికి పొమ్మనిచెప్పెను. భీమభటుడు తన గుఱ్ఱమెక్కి, శంఖదత్తుడు మరియొక గుఱ్ఱముపై తనవెంటరాగా బయలుదేరెను. దారిలో ఒక అరణ్యము తారసిల్లెను. చీకటిపడెను. వారిరువురును గుఱ్ఱములపై పయనము సాగించుచునే యుండిరి. గుఱ్ఱముల డెక్కల తాకిడికిని, సకిలింపులకును అడవిలోని సింహములు వచ్చి వారిపైబడి గుఱ్ఱములను చంపివేసెను. వారిరువురును,

తమ ఖడ్గములతో ఆ సింహములను చంపివేసి, ఎట్లో అడవిదాటి, తెల్లవారునప్పటికి గంగాతీరమును చేరి విశ్రమించిరి.

పిదప వారు గంగా తీరముననే, మరికొంత ముందునకు బోయిరి. అచట నొక విప్ర యువకుడు వేదపారాయణము చేయుచు నిష్టతో బ్రహ్మచర్య వ్రతము జరుపుచుండెను. అది చూచి భీమభటుడు "ఆర్యా, ఏల నీవు ఒంటరిగా ఇటనున్నావు?" అని ప్రశ్నించెను. "ఆర్యా, నేను వేదవేదాంగములను చదివిన వాడనైనను ధనహీనుడను. అందువలన గృహస్థాశ్రమము స్వీకరింపజాలక పోతిని. అందువలన నిట గంగాతీరమున పండ్లు దిని, వేదములను వల్లించుచు కాలము గడుపుచున్నాను" అనెను. భీమభటుడు ఆ మాట విని కనికరించి, తన మిత్రునితో మంతనము చేసి, తన తల్లి యిచ్చిన రత్నాభరణములను, ధనమును ఆ బ్రాహ్మచారి కిచ్చెను. పిదప నిరువురును గంగను దాటుటకు వీలు కలుగునేమో యని కొంతదూరము గట్టు వెంట నడచి వెరవు కానక, ఈదుకొని దాటుటకు నిశ్చయించిరి. నడియేట నీటి వేగమునకు శంఖదత్తుడు కొట్టుకొని పోయెను. భీమభటుడు ఆవలిగట్టు చేరి మిత్రుని కోసము ఎంతోతడవు వేచియుండి, చాలతడవు వెదకెను. మిత్రుడు లేని జీవితము అంధకార బంధురముగా తోచెను. అతడు మిగుల శోకించెను. చెలికాడు సంపదలతోడి కేళిసదనము వంటివాడు; కష్టములలో ఆశ్రయమిచ్చు



వాడు; రహస్యములను కాపాడుటకు కోశాగారమువంటి వాడు. అట్టి మిత్రుడు కనిపింపకపోవుటవలన గంగలోపడి ఆత్మహత్య చేసికొన నుద్యమించెను. ఎంతటి ధీరులైనను ఇష్టులను కోల్పోవుటను సహింపలేరు.

అప్పుడు భగవతి గంగ అతనికి ప్రత్యక్షమై "పుత్రా, సాహసమునకు పూనుకొనకుము. నీ చెలికాడు మరణించలేదు. త్వరలోనే నిన్ను కలసికొనును. ప్రతిలోమానులోమ యను దివ్య విద్య నొకదానిని నీకు ఉపదేశించుచున్నాను దీనిని ప్రతిలోమముగా పఠించిన కోరిన రూపము వచ్చును. అనులోమముగా పఠించిన ఒరులకంట పడడు. ఇది సప్తాక్షరీవిద్య. దీని మహిమవలన నీవు గొప్ప రాజ్యము సంపాదించి చక్రవర్తి వగుదువు." అని ఆ విద్యను ఉపదేశించెను.

భీమభటుడు గంగాదేవి మాటలపై విశ్వాసమూని, ధైర్యముతో, ఉత్సాహమను రథమునెక్కి బయలు వెడలి సకల సంపదలకు నిలయమగు లాటదేశము చేరెను. అతడు లాటదేశ రాజధాని చేరి, అట తిరుగుచు, నొకచోట ద్యూతశాలను చూచి, కుతూహలముతో లోన అడుగిడెను. అచట జూదమాడి ధనము కోల్పోయి మోకాళ్ళపై తలయిడి యోగుల వలె నిశ్చల దృష్టితో ఆలోచించువారును, పరాజయము కలుగగా, నేలను చేతితో తాటించి హాహాకారము చేయు

వారును, ఆక్షేపించువారును, కోపముతో ప్రతిజ్ఞలు చేయువారును, లేచి నిలబడి చేతులు త్రిప్పుచు నేదియో చెప్పువారును, పాములవలె బుసకొట్టువారును, పిచ్చివారివలె గుడ్డలు లేక దిసమొలలతో నున్నవారును—ఇట్లు జూదగాండ్రు పలు తెరగుల నుండిరి. భీమభటుడును కౌతుకముతో వారితో జూద మాడి, లందరిని గెలిచెను. పిదప, వారితో "మిత్రులారా, నేను వినోదమునకై జూదమాడితిని గాని, ధనాపేక్షతో గాదు. మీరు మీ సొమ్మును తీసికొనుడు" అని చెప్పి వారి సొమ్ము వారికిచ్చి వేసెను. అతని యౌదార్యమువలన జూదగాండ్రందరును మిత్రులైరి. భీమభటుడు వారి వృత్తాంత మడుగగా, వారిలో వసుదత్తుడనువాడు తన సంగతి యిట్లు చెప్పెను.

"హస్తినాపురమున శివదత్తుడను బ్రాహ్మణుడుండెను. నేను అతని కుమారుడను. నేను చిన్ననాడే విద్యలన్నియును నేర్చితిని. నాకు పెండ్లికూడ ఆయెను. మా తల్లి మిగుల గయ్యాళి. కలహశీల. ఎప్పుడును తండ్రితో పోట్లాడుచుండెను. మా తండ్రి విసుగుపుట్టి ఇల్లువీడి దేశాంతరమేగెను. మా తల్లి నా భార్యను గూడ నిష్కారణముగ పరుషవాక్యములతో బాధ పెట్టుచుండెను. కోడలు నవ్వుచు మాట్లాడిన దుశ్శీలమని, మాట్లాడని యెడల గర్వమని, వినయముతో ప్రవర్తించిన మాయ అని, భయముతో మెలగిన నటన



మని, సేవచేసిన ఏదియో కుట్రయని మా తల్లి విపరీతముగా భావించుచు కోడలిని దోషములే యెన్నుచు బాధింప సాగెను. ఆమె ఆ దుఃఖమును సహింపలేక ఎచటికో పోయెను. మిత్రులమాట కాదనలేక మరొకతెను పెండ్లాడితిని. మా తల్లి దానినికూడ పరుషవాక్కులతో ఇల్లు వెడలగొట్టెను. నా బంధుమిత్రులు మరల నన్ను పెండ్లియాడుమని వేధించిరి. మా తల్లి స్వభావమును ఎంతచెప్పినను వారు నమ్మలేదు. వారి పోరు పడలేక, నేను ఒక నిలువెత్తు కొయ్య బొమ్మను తెచ్చి, చీరకట్టించి, ముసుగిడి, అలంకరించి, క్రొత్త భార్యయని అందరికిని విదితపరచి యింట ఒకగదిలో నుంచితిని. మా తల్లి ఆమెను పలుకరించి, ప్రత్యుత్తర మీనందులకు "దీనికింత గాంభీర్యమా ?" అని అనుమానించి, కోపముతో తనతలను బాదుకొనుచు, రక్తముకారుచుండగా, వీధిలోనికివచ్చి, గట్టిగా ఏడ్వసాగెను ఇరుగు పొరుగువారు గుమిగూడి ప్రశ్నించగా, "అయ్యో ! ఏమని చెప్పుదును ! ముసలిదానిననియు, ఒంటరిదాననియు నన్ను క్రొత్తకోడలు కొట్టినది" అని అరువసాగెను ఇరుగు పొరుగు వారందరును న్యాయము చెప్పువారై ఇంటిలో దూరి · క్రొత్తకోడలి ముసుగు తీసిచూచిరి. కర్రబొమ్మ. మాతల్లి కల్లమాటలును, గయ్యాళితనమును వారికి తెలియవచ్చెను తల్లి చేతలను పరిహసించి నిందించిరి. నేనును తల్లిబాధలు పడలేక

స్వదేశము వదలి యిటకువచ్చితిని. ఓడినవారు గెలిచినవారికి దాసులు కావలెనను పందెముతో స్ాహసవంతులగు చండభుజంగుడు మున్నగు వీరందరిని గెలిచితిని. ఇప్పుడు మేమందరము నీకు మిత్రులము".

భీమభటుడు అతని వృత్తాంతమును, తక్కిన నెచ్చెలుల కథలను వినుచు, తనవార్తలను చెప్పుచు కొన్నాళ్లు అచట గడపెను. ఇంతలో వానకాలము వచ్చెను. విపాశానది నిండుగ ప్రవహించుచుండెను. ఒకనాడు బెస్తలు ఏనుగువంటి పెద్ద చేపనుపట్టి ఒడ్డుచేర్చిరి. దానిని చూచుటకు వారందరును కోలాహలముతో ఏటియొద్దు చేరిరి. భీమభటుడును తన మిత్రులతో నచటికిపోయెను. బెస్తలు దాని పొట్టను కత్తులతో కోసిరి. దానినుండి ఒక మనుష్యుడు వెలువడెను. జనులందరును మహాశ్చర్యముతో చూచుచుండిరి. భీమభటుడు జనులను త్రోసికొని ముందుకుపోయి, తనమిత్రుని కౌగలించుకొని, చుట్టును మూగిన జనులకు తనవృత్తాంతము చెప్పి, చేపలవారికి కొంత ధనమిచ్చి మిత్రులతో గూడ ద్యూతశాలకు వచ్చెను. దారిలో శంఖదత్తుడు తన వృత్తాంతమును సంగ్రహముగ నిట్లు చెప్పెను:
"చెలికాడా, ఆనాడు అట్లు గంగాప్రవాహమున కొట్టుకొనిపోవుచు సముద్రము చేరితిని. నన్నొక తిమింగిలము మ్రింగివేసినది. నేను దానికడుపున ప్రవేశించి, ఇన్నాళ్ళును







అచ్చటే కాపురము చేసితిని. నేడు విపాశానదిలో ఆ తిమింగిలము ధీవరులకు పట్టువడినది. వారు దాని కడుపుచీల్చి నన్ను వెలికితీసిరి. నిన్ను చూచుభాగ్యము మరల కలిగినది" భీమభటుడు తనమిత్రుని సంగతివిని విధివిధానమునకు ఆశ్చర్యపడెను.

ఇట్లుండగా ఆ నగరమున, నాగరాజోత్సవములు వచ్చెను. భీమభటుడు మిత్రులతోగూడ ఆ ఉత్సవములను చూడబోయెను. చంద్రాదిత్యమహారాజుకుమార్తె హంసావళి యనునదియు దాసీజనముతో ఆ ఉత్సవముచూచుటకై నాగరాజమందిరమునకు వచ్చెను. స్ఫటికపు బొమ్మవలె, వెన్నెలగుంపువలెనున్న హంసావళిని భీమభటుడు చూచెను. ఆమెయును భీమభటునిచూచి, అప్తురాలగు నొక దాసినిపంపి అతని వృత్తాంతము తెలిసికొనెను. పెండ్లియాడవలెనని యిరువురకును సంకల్పము కలిగెను.

ఆనాటిరాత్రి రాజకన్యక అంతిపురమునుండి భీమభటుని కడకువచ్చి, ఏకాంతమున అతనికి రాజకుమార్తెస్థితిని తెలిపి, అతనిని ఆమెయొద్దకు పిలుచుకొనిపోయెను. అతడు ప్రతిలోమానులోమ విద్యనెరిగినవాడగుటవలన ఎవరికిని కానరాక దాసివెంట అంతఃపురముచేరి, రాజపుత్రిని గాంధర్వ విధితో వివాహమాడెను. ఇట్లు కొన్నాళ్లు గడచెను. రాజపుత్రిలో మార్పును, దాసదాసీజనము గ్రహించి

రాజున కెరిగించిరి. రాజు ఆ చోదు దెవడో కనుగొనుడని యుత్తరువు చేసెను. రాజకుమారి తనపతికి ఎట్టి అపాయము వచ్చునోయని భయపడి తండ్రి కాళ్ళపైబడి మన్ననవేడెను. రాజు ప్రీతుడై భీమభటుని వెదకి పిలిపించి, అతని రూపు రేఖలకును, పరాక్రమాతిశయమునకును, విద్యావినోదముల కును మెచ్చి, తన కుమార్తెనిచ్చి, యథాశాస్త్రముగ వివాహ మొనర్చెను. భీమభటుడు రాజకుమార్తెతోపాటు లాట రాజ్యమునుకూడ పొంది, శంఖదత్తాదిమిత్రులు తోడుగా నుండగా పౌర సమ్మతముగా రాజ్యము చేయుచుండెను.

అట రాతానగరమున ఉగ్రభటుడు మరణించెననియు సమరభటుడు రాజయ్యెననియు వార్త తెలిసి, భీమభటుడు తన మిత్రులతో ఆలోచించి రాతానగరముపై దండెత్తి పోయెను. సమరభటుడును సైన్యముతో భీమభటుని ఎదు ర్కొనెను. ఘోరమగు యుద్ధము జరిగెను. భీమభటుడు తన తమ్మునితో కత్తిపోరునకు దిగి అతని తలను తన కత్తితో నరికి తన పగ తీర్చుకొనెను. పిదప అతడు రాతారాజ్యమున ప్రవేశించి, తన తల్లియగు మనోరమకు నమస్కరించి, ఆమె ఆశీర్వాదములు గైకొని, రాతారాజ్య సింహాసన మెక్కెను. అనంతరము పెక్కురాజ్యములు జయించి, సార్వభౌము డాయెను. లాటరాజ్యమున తన మిత్రుడగు శంఖదత్తుని



ప్రతిష్ఠించి, వీరులగు మిత్రులతోను, హంసావళితోను సుఖముగా నుండెను.

ఒకమారు తేజోనిధియగు ఉతంకుడను మహాముని భీమభటుని చూడవచ్చెను. భీమభటుడు సుఖలాలసుడును, రాజ్యమదాంధుడునునయి, ఆ మునికి వెంటనే స్వాగత సత్కా రములు చేయక ఆలసించెను. ఉతంకుడు కోపగించుకొని, "ఐశ్వర్య మదముతో ఉన్మత్తుడవయి, పెద్దలను లక్ష్య పెట నందున నీవు రాజ్యము పోగొట్టుకొని, ఏనుగువయి, అడవిలో కష్టముల పాలగుదువు" అని శపించెను. భీమభటుడు శాప మునకు భయపడి మునిపాదములపై పడి ప్రార్థింపగా, ముని మనసు కరగి, "మృగాంకదత్తుని మంత్రికి నీవు నీ వృత్తాం తము వినిపింతువు. అప్పుడు అతనికి పోయినకన్నులు వచ్చును. నీకును శాపమోక్షము కలుగును. రాజా, నీవు పూర్వము చంద్రశేఖరుని పూజించితివి. అతడు ప్రీతుడై నీవు గంధర్వ రాజవగుదువని వరమిచ్చెను. ఆ వరముకూడ శాపాంతమున నీకు సిద్ధించును!" అని చెప్పి తనదారినిపోయెను. ఆ భీమ భటుడను నేనే. ఏనుగురూపమున అడవుల తిరుగుచున్నాను. నా పుణ్యవశమున నిన్ను కలసికొంటిని. నీ కృప వల్లన శాప విమోచనము కలిగినది. నీవును మరల దృష్టిపొందితివి." అనుచు ఆ ఏనుగు గంధర్వరూపము ధరించెను.

పొదలచాటునుండి ఈ వృత్తాంతమంతయును వినుచుండిన మృగాంకదత్తుడు, ఆ అద్భుతమునుచూచి, ఆశ్చర్యభరితుడై, పొదలచాటునుండి విసురుగా వెలుపలికివచ్చి చండశక్తుని గాఢముగా కౌగలించుకొనెను. తక్కినమిత్రులు వారి చుట్టును మూగిరి. చండశక్తి భీమభటుని మృగాంకదత్తునికి పరిచయముచేసి, అతని దయవల్లనే తనకు శాపవిమోచనము కలిగినదని చెప్పుచు అతనిని స్తుతించెను. పిదప గంధర్వుడు మృగాంకదత్తునికి "రాజకుమారా, నీవు త్వరలో తక్కిన మంత్రులను కలిసికొందువు, శశాంకవతిని పెండ్లాడి చక్రవర్తి వగుదువు. నీవు ఎప్పుడు నన్ను తలచికొనిన అప్పుడు నేను నీవద్దకువచ్చి తోడ్పడుదును." అని మాటయిచ్చి అదృశ్యుడై పోయెను. మృగాంకదత్తుడును ఐదుగురు మంత్రులతోను, మిత్రులతోను ఆ నాడు ఆ యడవియందే గడపెను.

---

# 7

# హేరంబవృక్ష వృత్తాంతము

---

మృగాంకదత్తుడు ఎప్పటివలెనే మంత్రిసహితుడై ఉజ్జయినికి పయనమయి, దారిలో మరియొక యడవిని బడియెను. ఎండ మండిపోవుచుండెను. అడవిలో ఎటనో దావాగ్ని రగిలి, పొగలు ఆకాశమంతయును ఆక్రమించుకొని ప్రళయకాలమువలె భయము కలిగించుచుండెను. మృగాంకదత్తుడు ఒక చోట విశ్రమించి, ఆ పొగలను చూచుచుండగా, ఒక వికృతాకారుడగు నరుడు ఎవరినో మోసికొని గగనమార్గమున పోవుచుండుట కనిపించెను. పరికించి చూడగా, అతడు తన మంత్రియగు విక్రమ కేసరియే. మృగాంకదత్తుడు దిగ్గునలేచి, తన మిత్రులతో "నెచ్చెలులారా, లెండు. ఎవడో దురాత్ముడు మనమిత్రుడగు విక్రమకేసరిని అపహరించుచున్నాడు. అతనిని విడిపించు నుపాయము చేయుదము" అని హెచ్చరించెను. అందరును యుద్ధసన్నద్ధులై యుండిరి. ఇంతలో విక్రమకేసరి ఆకాశమునుండి క్రిందికి దిగివచ్చి, మృగాంకదత్తునికి నమస్కరించి, శ్రుతధి మొదలగు వారిని కౌగలించుకొని, కుశలప్రశ్నలైన పిదప,

తనను మోసికొనివచ్చిన వికార రూపునితో "ఓ మహా సత్త్వుడా, పొమ్ము నేను తలచినప్పుడు రమ్ము" అని అతనిని వీడ్కొల్పెను. మృగాంకదత్తుడు విక్రమకేసరినిచూచి "మిత్రమా, ఎవరీ కళాకారుడు? ఎక్కడసంపాదించితివి?" అని ప్రశ్నింపగా నతడు తన వృత్తాంతమిట్లు చెప్పసాగెను.

## విక్రమ కేసర్యాఖ్యాయిక

"దేవా" ఆ నాటిరాత్రి నాగరాజ శాపము వలన ఎచ్చటనోపడి మూర్ఛపొందిన నేను, తెలివిపొంది చూచు వేళకు భయంకరమగు అడవిలోనుంటిని. తర్వాత ఆ అడవిని నడచి పోవుచు దప్పిగొని నీటికై వెదకికొనుచుపోయి ఒక పుష్కరిణిని చూచితిని. దాని చల్లని నీటితో దప్పితీర్చుకొని, ఆ పుష్కరిణి గట్టుననే విశ్రమించితిని. అక్కడి కొక వృద్ధ బ్రాహ్మణుడు హాహాకారములు చేయుచు వచ్చెను. "నాయనా, నన్ను పాముకాటు వేసినది. విష తాపమును భరింపజాలకున్నాను. ఈ పుష్కరిణిలోపడి ప్రాణములు వదల దలచినాను. నిన్నును ఆ విషనాగము కాటు వేయునేమో! మరియొక చోటికి పొమ్ము." అని అతడు నాతో పలికెను. నేను సుపర్ణవిద్యను ఎరిగినవాడను గనుక, అతనిని చికిత్సించి విషరహితుని చేసితిని. అతడు కృతజ్ఞతతో "నాయనా, నీవు దేవతవు గాని మానవుడవుకావు. సత్త్వ



సాగరుడవు. బేతాళోత్థాపిని యను విద్యను నేను నీ కుపదేశించెదను. ఆ విద్య ధైర్యవంతులకు ఫలించును గాని, అధీరులకు ఫలించదు. నీవు మహావీరుడవు గనుక నీకు దీనిని ఉపదేశింతును." అనెను. నేను అతనిమాటలువిని, "బ్రాహ్మణోత్తమా, నాకు నీ బేతాలోత్థాపిని విద్య ఎందులకు? మిత్రులకును. ఇష్టులకును దూరమైతిని. గ్రుడ్డివానికి వెన్నెల వలె నాకు నీ మంత్రవిద్య ఎందులకు?" అని అంటిని. ఆ వృద్ధుడు నవ్వి "వత్స, నీవు నీ మిత్రులతో కలిసికొనుట యెంతటిది? ఈ విద్యవలన సకల మనోరథములును సిద్ధించును. పూర్వము త్రివిక్రమసేనుడను రాజు బేతాళుని అనుగ్రహమువలన కోరిక లన్నియును తీరి, తుదకు విద్యాధర చక్రవర్తిత్వమును పొందలేదా? ఆ త్రివిక్రమసేనునికథ చెప్పెదను, వినుము. దీనివలన నీకు బేతాళోత్థాపిని యను విద్యయందు మక్కువ యేర్పడును" అని పలికి త్రివిక్రమసేనుని గాథ చెప్పదొడగెను.

## త్రివిక్రమ సేనాఖ్యాయిక

పూర్వము గోదావరీ తీరమున ప్రతిష్ఠానమను పట్టణమును త్రివిక్రమసేనుడను రాజు పాలించుచుండెను. అతడు మిగుల సాహసి, దానశీలుడు, దయావంతుడు. అతనిని శాంతిశీలుడను శ్రమణకుడు నిత్యమును దర్శించి, ఒక లమును

ఇచ్చుచుండెను. అతనినిచూచిన సీతను అపహరించుటకు వచ్చిన లంకాధిపతియో అన్నట్లుండెను. ఆ శ్రమణకుడిచ్చు పండును త్రివిక్రమసేనుడు దగ్గరనుండు కోశాధ్యక్షునకు అందించుచుండెను ఈ విధముగా పది సంవత్సరములు గడచెను. ఒకమారు రాజు ఆ పండును పట్టుకొనియుండగా కావలివారినుండి తప్పించుకొని కొలువు కూటము చొచ్చిన క్రీడాకపి దానిని లాగుకొని పోయి చాపల్యముతో కొరికి చూచెను. ఆ పండునుంచి ఒక దివ్యరత్నము క్రింద పడెను. ఆ రత్నకాంతికి ఆస్థానమండప మంతయు కాంతిమయమాయెను. రాజు ఆ రత్నమును గైకొని ఆశ్చర్య పడి, వెంటనే కోశాధ్యక్షుని పిలిపించి, "ఓయీ, ఈ శ్రమణకుడు నిత్యము నిచ్చుచుండిన పండ్లు ఏమైనవి?" అని ప్రశ్నించెను. కోశాధ్యక్షుడు భయముతో గడగడవడకుచు, "దేవా ఆ పండ్లను, వానినుండి వెలువడిన రత్నములను భద్రముగా కోశాగారమున దాచితిని." అని విన్నవించి వానిని తెచ్చి రాజునకు నివేదించెను. న్యాయసాగరుడగు త్రివిక్రమసేనుడు ఆ రత్నములను కోశాధ్యక్షునకే బహూకరించెను.

ఎప్పటివలె శ్రమణకుడు రత్నఫలమును ఇచ్చినప్పుడు రాజు అతనితో "ఓయీ, శాంతిశీలశ్రమణకా, నీ ప్రవర్తనము నాకు చిత్రముగా నున్నది. ఈ రత్నములతో నీవు ఏమి కోరుచున్నావు?" అని ప్రశ్నించెను. శ్రమణకుడు



ఇదియే తన వాంఛితసిద్ధికి అదననిభావించి: "రాజశేఖరా, నీ బోటి నరపతులు మర్యాదలు మీరనివారు. పరులకష్టములను సహించువారు. శౌర్యసాగరులు. ఇట్టివారిని క్కాక మరెవరిని సేవింతును? పదార్థములను సాధించి యుపకరించుటకై శరీరమును మీదుకట్టి, పరుల ఆశ లన్నిటిని పూరించుచు, దుర్దశవచ్చినప్పుడు మిత్రునివలె తోడ్పడు నీవంటివానిని తప్ప మరి యెవరిని యాచింతును? నీవు మహావీరుడవు. నాకు సాయ మొనర్పుము." అని కోరెను. రాజు అంగీకరించెను. అప్పుడు శ్రమణకుడు "రాజా, రానున్న కృష్ణపక్ష చతుర్దశి రాత్రి శ్మశానములో నాకొక మంత్రసాధనయున్నది. నేను వల్లకాటిలో నున్న పెద్ద మఱ్ఱిచెట్టుక్రింద నుందును. నీవు కరవాల విభూషితుడవై రావలయును." అని కోరెను. రాజు దానికి ఒప్పుకొనెను. పిదప శ్రమణకుడు మంత్రసాధనమున ప్రవేశించుటకై పోయెను.

కృష్ణపక్ష చతుర్దశి వచ్చెను. త్రివిక్రమసేనుడు శ్రమణకున కిచ్చిన మాటప్రకారము కాలాగరు లేపమును మెయినిండ అలదుకొని, నల్లటి బట్టలు ధరించి, భూతప్రేతపిశాచదోష హరమగు తమాల కుసుమమ్మాలను సిగకుచుట్టి, ఖడ్గమును చేతపట్టుకొని, నడయాడుచున్న ఇంద్రనీలాద్రివలె, గజచర్మధారియగు ఈశ్వరునివలె రాత్రి శ్మశానమును చేరెను. శ్మశానము మహా భయంకరముగను, జుగుప్సా

కరముగను నుండెను. భూతములు తిరుగాడుచుండెను. కపాలములను గిన్నెలలో రక్తమును ఆసవమును పోసికొని, మెదడు గుజ్జును నంజుకొనుచు కాలుడు ఆటలాడుచున్నాడా అనునట్లుండెను. కాలుచున్న శవముల పొగలతో, వీరుల గర్జితములను ఉరుములతో, చితాగ్ని జ్వాలలనియెడు మెఱుపులతో, ప్రళయకాల మేఘమా అన్నట్లుండెను. ఒకవైపు గ్రద్దలు శవముల ప్రేగులు లాగుచుండెను. మరి యొక చోట కాలక దొర్లిన తలలుండెను. భయమునకును భయము గొల్పునదిగను, విమోహమునకును మోహము కలిగించునదిగను, తమస్సుకుకూడ అంధ తమస్సును కల్పించునదిగను, కృతాంతునకుకూడ కంపనము గలిగించునదిగను నున్న ఆ పితృ వనమునుచూచి త్రివిక్రమసేనుడు ఎంత మాత్రమును జంకక శ్మశానమున ప్రవేశించి. పెద్ద మఱ్ఱి చెట్టును వెదకి, దానిక్రింద మండలన్యాసము చేయుచున్న శ్రమణకుని యొద్దకుపోయి నమస్కరించి, "శ్రమణ శేఖర, నామాటమేరకు వచ్చితిని. ఏమి చేయవలెనో చెప్పుము" అనెను. క్షపణకుడు మిగుల సంతసించి "రాజా, నీవు సత్త్వవంతులలో అగ్రగణ్యుడవు. ఇప్పుడు నీవు చూపిన ధైర్యము వలన సమస్త ధీరుల యశస్సులకును కేతనము నెత్తినవాడవయితివి. ఇటకు దక్షిణదిశగా కోసెడు దూరము పోయితివేని ఒక శింశుపావృక్షము కనిపించును. దానిపై నొక పురుష



శవము వ్రేలాడుచుండును. దానిని తెచ్చి నాకు ఇమ్ము. నాకు మహోపకారమగును. దానిని తెచ్చునప్పుడు మౌనముతో నుండవలెను. మౌనభంగమయిన కార్యసిద్ధి కలుగదు." అనెను. రాజు అట్లే యని, పొదలో కాలుచున్న ఒక కొఱవిని దివ్వెటీగా పట్టుకొని, శింశుపా వృక్షమును వెదకుచుపోయి, తుదకు దానిని కనుగొనెను.

ఆ శింశుపావృక్షము ఎండి మోడయి యుండెను. ఉద్ధతుడగు నీచునివలె, కాంతిహీనుడగు దరిద్రునివలె భయముగొల్పు పిశాచమువలె, చీకిరిబాకిరిగా విశ్లిష్టముగానున్న కుకావ్యమువలె నుండెను. ఆ శింశుపా తరువునుండి ఒక మగపీనుగు తలక్రిందులుగ వ్రేలాడుచుండెను. దాని నోరు తెరచుకొనియుండెను. చేతులు భూమివరకును సాగియుండెను. దానినిచూడగా "భూమిలో నేను ఎట్టి పుణ్యబీజముల నైనను నాటనైతిని చేతులతో ఏ మంచి పని నైనను చేయనైతిని." అని చేతులువదలి తల క్రిందులుగా చింతపడుచున్నట్లుండెను. త్రివిక్రమసేనుడు శింశుపా వృక్షమును ఎక్కి ఆ శవమునకు గట్టిన త్రాటిని త్రెంచి, దానిని క్రిందికి పడవైచెను. పడిన వెంటనే ఆ శవము "అయ్యో! చచ్చితిని" అని గట్టిగా అరచెను. కరుణాసాంద్రుడగు రాజు చెట్టు దిగివచ్చి, తన సాహసమును నిందించుకొనుచు, దానిని ప్రాణమున్న దేమోయని దాని దేహమును పలుమారు తడ

వెను. ఆ శవము, అతని చెయిదమునకు వికటాట్టహాసము చేసెను. ఆ అట్టహాసముతో భూతప్రేతములకును భయముతో గగుర్పాటు కలిగెను. త్రివిక్రమసేనుడు భయపడక అది బేతాళమాయయని గ్రహించి, దానినెత్తి భుజముమీద పెట్టుకొనబోయెను. అది ఎగిరి మరల చెట్టుమీదికిపోయి, ఎప్పటివలె కట్టుతో వ్రేలాడదొడగెను. రాజు మరల చెట్టెక్కి దానినిదింపి భుజముపై భద్రముగ నిడుకొని, వేగముగ నడువసాగెను. అతనికి ఎట్లయినను మౌనభంగము కలిగింపవలెనని బేతాళుడు, "రాజా, దారి అలత తెలియకుండుటకు ఒక కథ చెప్పెదను వినుము." అని ఇరువదియయిదు కథల చెప్పి. ఇరువది మూడుమార్లు అతనికి మౌనభంగము కలిగించెను. త్రివిక్రమసేనుడును బేతాళుడు చెప్పిన కథలన్నియు విని అతడడుగు ధర్మ సందేహములను తీర్చుటలో తన మౌనవ్రతమునే మరచిపోవుచుండెను. ఇరువది నాల్గవ మారు రాజు బేతాళుని కథలోని సమస్యలను విడదీయలేక మౌనముతోనుండెను,

బేతాళుడు రాజు క్షమాగుణమునకును ధైర్యసాహసములకును, న్యాయతత్పరతకును మెచ్చి, శ్రమణకుని దుర్బుద్ధి యెరిగినవాడు కావున, క్షపణకుని వంచించి, వానిసిద్ధిని రాజునకీయదలచి అతనితో నిట్లనెను. "రాజా, నీ ధైర్యమునకును, ప్రజ్ఞాబలమునకును ఎవరికి ఒడలు పులక



రింపదు ? ఈ శాంతిశీల క్షపణకుడు మహాపాపి, వాడు నిన్ను మోసముచేయ తలపెట్టినాడు. బుద్ధిమంతుడవగు నీవు వంచనతోనే వానిని జయింపవలెను. నేను ఈ ప్రేతమును వదలిపోవుదును నీవు దీనిని మోసికొనిపోయి వానికిమ్ము. వాడు దీనిలో నన్ను అవాహనముచేసి పూజించును. దీనిని మహాప్రేతయాగమందురు. నీబోటి మహావీరుని ఈ యాగమున బలి యీయవలయును. కనుక వాడు నిన్ను బలియిచ్చుటకై సాష్టాంగదండప్రణామ మాచరింపుమని నీతోననును. అప్పుడు నీవు " నేను సమస్త సామంతరాజుల కిరీటములతో కొలువబడిన పాదములుగలవాడను. నాకు సాష్టాంగ ప్రణామము నెవ్వరును నేర్పలేదు. నీవు మొదట చేసి చూపుము. తర్వాత నేను చేయుదును " అనుము. అప్పుడు వాడు సాగిలపడును. వెంటనే నీవు అతని తలను నఱికివేయుము. లేకున్న వాడు నీతల నఱికివేయును. వాడు విద్యాధర చక్రవర్తిత్వమునకై నిన్ను యజ్ఞపశువుచేయ దలచినాడు. అంతయును విపులముగ నీకు చెప్పితిని. నీకు మేలగుగాక ! నేను పోయి వచ్చెదను. "

రాజు బేతాళుని మాటలు శ్రద్ధనావిని జాగరూకుడై శవమును మోసికొని క్షపణకుని యొద్దకు వచ్చెను. ఆ అనార్యుడు మిగుల సంతోషించి తన కార్యసిద్ధియగునని సంతృప్తిపడి, అతనిని మిక్కిలి కొనియాడెను. పిదప క్షపణ

కుడు శవమును స్నానముచేయించి, అలంకరించి చితాభస్మముతో తీర్చినమండలమున పెట్టెను. మనుష్యుల క్రొవ్వుతో దీపములు వెలిగించి, బేతాళుని ఆవాహనము చేసి, కలశమున నింపిన రక్తముతో అర్ఘ్యపాద్యాద్యుపచారములు చేసి పూజించి, బలియిచ్చు సమయమున, రాజునుపిలిచి "రాజా, నీ శ్రేయస్సు కొఱకు ఈ బేతాళునకు ప్రణామముచేయుము." అనెను. "నాకు ప్రణామముచేయుట తెలియదు. మీరే చూపుడు" అని రాజు సవినయముగా ప్రత్యుత్తరమిచ్చెను. దైవమోహితుడగు ఆ క్షపణకుడు సాగిలపడగానే రాజు తన కత్తితో ఒక్కదెబ్బకే వాని తల ఖండించి బేతాళునకు నైవేద్యము పెట్టి, పూజావిధిని పూర్తిచేసెను. అప్పుడు గగనమునుండి పుష్పవర్షముకురిసెను. బేతాళుడతనికి కోరిన వరములిచ్చెను. త్రిమూర్తులును ప్రత్యక్షమై విద్యాధర చక్రవర్తిత్వము మున్నగు పెక్కు సిద్ధులొసంగిరి. త్రివిక్రమసేనుడు వారందరి వరములను బడసి, తెల్లవారనుండగానే నగరమున ప్రవేశించెను. అతని సిద్ధులు తెలిసినపిదప, నగరువారును ప్రజలును చాల ఆనందించిరి. అనంతరము త్రివిక్రమసేనుడు పెక్కేండ్లు రాజ్యమేలి, తుదకు విద్యాధర చక్రవర్తిత్వము పొందెను. అతనికీర్తి త్రిపథగయగు గంగవలె ముల్లోకములను వ్యాపించెను."



"అందువలన "వత్సా, నీవును ఈ వేతాళోత్థాపినీ విద్యవలన మిత్రుల శ్రేయస్సును పొందగలవు." అని నాకు ఆ విప్రుడు ఆ విద్యను ఉపదేశించెను. నేను ఆ మంత్రమును సాధించి, బేతాళుని వాహనముగా చేసికొని, గగన మార్గమున తిరుగుచు, ఆ విద్యాప్రభావమున ఇచ్చట మీరుండుట తెలిసి వచ్చితిని."

విక్రమకేసరి వృత్తాంతమువిని అందరును సంతోషించిరి. మృగాంకదత్తుడు మరల మిత్రులలో ఉజ్జయినికి పోవుచు, నీరు, నీడ లేని యొక్క అడవి చేరెను. గ్రీష్మఋతువు. ఎండ భరింపరానిదయ్యెను. వారు అట్లే నడచుచుపోగా, ఒక సరోవరము కనిపించెను. సరోవరమున పద్మములు వికసించియుండెను, రాయంచలు అలల యుయ్యెలలలో ఊగుచుండెను. తామరాకులపై పడిన నీటి చుక్కలు ముత్యములవలె మెరయుచు ఈ సంసారము అనిత్యమని చాటుచున్నట్లుండెను. ఆ సరోవరమును చూచినంతనే వారందరి మనస్సులు చల్లబడెను. కొన్ని వస్తువులు, కొందరు మానవులు చూచినంతనే సంతోషముకలుగజేయుట అదృష్ట విశేషము.

## మిత్రసమాగమాఖ్యాయిక

ఆ సరోవరము పడమటిగట్టున నొక పెద్ద వృక్షముండెను. దాని కొమ్మలు వేనవేలు ఆకాశమును ఆక్రమించి

యుండెను. ఆ కొమ్మలు మధురిమాగిన పండ్లతో వంగి యుండెను. ఐశ్వర్యమువలె నిలువనీడనిచ్చుచు, అభిమానమువలె ఉన్నతమై, సౌహార్దమువలె అల్లిబిల్లిగా నల్లుకొని, సంతోషమువలె సుఖము కలిగించుచు. ఆశ్రయించువారల సంతాపములు పోగొట్టి, సకలాశలు నిండించు ఉత్తమవంశ్యుడగు ప్రభువువలెనున్న ఆ మహావృక్షమును చూచి, శ్రుతధి తక్క తక్కిన మంత్రులందరును పండ్లుకోసికొని తిందమను తలంపుతో ఉత్సాహముతో నెక్కిరి వారు కొమ్మలగుబురులలో చేరి, ఎటకో మాయమైపోయిరి. మృగాంకదత్తుడు వారిని పెక్కుమార్లు పెద్దగొంతుకతో పిలిచెను. అతని కేకలు ప్రతిధ్వనించెనే కాదు, ఎవ్వరును మారుపలుకరైరి. హఠాత్తుగా కలిగిన ఈ దుఃఖమును మృగాంకదత్తుడు సహింపలేక మూర్ఛిల్లెను శ్రుతధి శైత్యోపచారము చేయగా, అతడులేచి, దేహత్యాగము చేయుటకు నిశ్చయించెను. అప్పుడతనికి అశరీరవాక్కు ఈ విధముగా వినిపించెను: "రాజకుమారా, ఈ మహావృక్షము గణాధిపుడు గణాధిపుడు వినోదార్థము ఈ మహావృక్షమై వెలసినాడు. నీ మంత్రులు ఈ వృక్షమును పూజింపనందున ఆకులును, పండ్లునయిరి. నీవు హేరంబుని పూజింపుము. నీమంత్రులను పొందగలవు. లేనియెడల నూరేండ్లుగడిచినను వారికి మోక్షములేదు."



మృగాంకదత్తుడు ఆమాటలువిని, మరణప్రయత్నము మానుకొని, పన్నెండునాళ్లు ఉపవసించి, గణేశ్వరుని పూజించెను. గణేశ్వరుడు అతనికి స్వప్నమున నగపడి వాంఛితము ఈడేరునని వరమిచ్చెను తెల్లవారిమెలకువగలిగి లేవగనే పదుగురు మంత్రికుమారులు వచ్చి అతనికి నమస్కరించిరి రాజకుమారుడు ఈ అత్యద్భుతమునకు ఆశ్చర్యపడి "ఆహా! ఏమి నాభాగ్యము! ఈ అరణ్యమున ఎంతటి లాభము కలిగినది! ఈ సంతోషభారమును సహింపలేక పోవుచున్నాను." అని, వారందరిని కౌగలించుకొనెను. "మిత్రమా మేఘబలుడా, నెచ్చెలీ దృఢముష్టి, సఖుడా స్థూలబాహూ, చెలికాడా వ్యాఘ్రసేనా, ఇన్నాళ్ళు ఎక్కడ గడపితిరి? ఎట్లుంటిరి?" అని అత్యంత కుతూహలముతో వారిని రాజకుమారుడు ప్రశ్నించెను. మతిమంతుడగు వ్యాఘ్రసేనుడిట్లు చెప్పసాగెను.

"దేవా, ఆనాడు అట్లు మనము పారావత నాగుని శాపముతో ఒక్కొకరమై మూర్ఛపోయితిమి గదా! రాత్రి యెట్లుగడచెనో ఏమో! తెల్లవారుజామున మేల్కొని చూడగా, ఒక సరస్సుతీరమున నుంటిని. ఆ సరస్సున స్నానము ముగించి, తీరమున కూర్చొనియుంటిని. ఇంతలో దృఢముష్టి, స్థూలబాహువు, మేఘబలుడును వచ్చి చేరిరి. అచటికివచ్చిన్న మునికుమారుడొకడు మమ్ములను చూచి,

మమ్మ సమాశ్వాసపరచి కణ్వముని ఆశ్రమమునకు పిలుచుకొనిపోయెను. కణ్వముని తేజస్సుతో సాక్షాత్తుగా అగ్ని దేవునివలె ప్రకాశించుచుండెను. పలువురు మునీశ్వరులు అతని సన్నిధిలో చేరియుండిరి. త్రిలోక విషయములను కరతలామలకముగా ఎరిగిన వాడగుటచే శోకార్తులమయిన మమ్మ చూచిన వెంటనే కణ్వముని దంతకాంతులతో అమృతమును చిలుకరించుచు నిట్లునుడివెను ;— "నాయనలారా, ఈ ప్రపంచమున చిత్రవిచిత్రములగు కర్మలవలన మానవులకు సుఖదుఃఖములు, సంయోగ వియోగములు ఒకదాని తర్వాత మరొకటిగా సంభవించుచునే యుండును. అందువలన శోకసాగరమున బడకుడు. త్వరలో మీరు మృగాంకదత్తుని కలిసికొనగలరు. పూర్వము సుందరసేనుడను రాజు భార్యతోను, మిత్రులతోను చిరకాలము వియోగముపొంది పిదప వారిని కలసికొనెను." మేమును కుతూహలముతో ఆ కథను చెప్పుడని కోరగా, మునీంద్రుడు ఇట్లు చెప్పసాగెను :

## మందారవత్యాఖ్యాయిక

నిషధ దేశమున అలక యను పట్టణముగలదు. అక్కడి సుందరుల ముఖ కాంతితో పట్ట పగలే వెన్నెలలు కాచినట్లుండును. అక్కడ ఉన్నత భవనగోపుర పతాకములు గాలికి



రెపరెపలాడుచుండుట చూచిన ఆకాశగంగ ప్రవహించుచున్నట్లుండును. ఆ పట్టణమును శక్తిమంతుడగు మహాసేనుడను రాజు పాలించుచుండెను. అతడు శత్రుభీకరుడు. చంద్రుడెవరు ? గౌరీపితయగు హిమాలయుడెవరు ? గౌరీపతియే ఎవరు ? వీరందరు తెల్లగా నుండుటకు కారణమేమి ? శక్తిమంతుని కీర్తియే. అతనికి శశిప్రభ అనే భార్య ఉండెను. అతని మంత్రిపేరు గుణపాలితుడు. పేరుకు తగినట్లే గుణగణపూర్ణుడు. అతనికి రూపవిలాసములే ఆకారము దాల్చినవా అన్నట్లు ఒక కుమారుడుకలిగెను. అతనిపేరు సుందరసేనుడు. అతనికి మురారికి నాలుగు బాహువులవలె నలుగురు మంత్రులుండిరి. వారతనిని నీడవలె అనుసరించుచు నుండెడివారు.

ఒక మారు ఆ రాజకుమారుడు మంత్రులతోపాటు ఊరి జాతర చూచుటకు బయలు వెడలెను. జాతరలో పలువురు అతని సౌందర్య సౌశీల్యమునుచూచి ముగ్ధలగుచుండిరి అప్పుడు కాత్యాయని అను ఒక తాపసి అతనిని చూచి, అతని సౌందర్యమును రెప్ప వేయక చూచుచు స్తబ్ధయై నిలబడిపోయెను. రాజకుమారుడు మిత్రులతో ముచ్చటాడుచు పోవుచున్నందున ఆమెను చూడలేదు. అందులకు తాపసి, రాజకుమారునికి దర్పము హెచ్చినదని భావించి. "ఇప్పుడే ఈ రాజకుమారుడు తన సౌందర్యము

నకు మిడిసిపడుచున్నాడు. హంసద్వీపాధిపతి కుమార్తె మందారవతిని పెండ్లాడిన ఎంతటి కావరము పేరుకొనునో!" అనెను. తాపసి మాటలను రాజసేవకులు రాజకుమారునికి నివేదించిరి. రాజకుమారుడు ఆ మాటలు విని, తాపసిని పిలిపించి నమస్కరించి, వినయముతో మందారవతి వృత్తాంత మడిగెను. తాపసి సంతోషించి ఇట్లు చెప్పెను :- "కుమారా, హంసద్వీప రాజగు మందరదేవునికి మందారవతి యను కుమార్తె యున్నది. ఆమెను సృష్టించిన పిదప బ్రహ్మ "అమ్మయ్య, ఇక నా ప్రయత్నము సఫల మయినది. అని ఊపిరి తీసికొనెను. ఆమెను మించిన సుందరి యిక ప్రపంచమున లేదు. నేను ఆమె బొమ్మను గీచి చూపెదను చూడుము. ఇటువంటి సుధామూర్తి మరి యెచ్చట లభించును?" అని చెప్పి తాపసి అతనికి మందారవతి చిత్రము లిఖించి ఇచ్చి వెడలిపోయెను.

ఆ చిత్రమును చూచినది మొదలు సుందరసేనుడు యోగివలె ఆమెనే ధ్యానించుచు గడపసాగెను. అతని మంత్రులు ఈ సంగతిని రాజగు మహాసేనునికి తెలిపిరి. అతడు హంసద్వీపాధిపతికడకు దూతలను పంపి, తన కుమారునికి అతని కుమార్తెనిచ్చి వివాహము చేయునట్లు కోరెను. మహాసేనుని దూత హంసద్వీపమునకుపోయి, సుందరసేనుని చిత్రపటమును ఆ రాజునకు చూపెను. రాజు మిగుల సంతో



షించి, అంతఃపురమునకు పోయి, ఆ చిత్రమును తన కుమార్తెకు చూపి, ఆమె సమ్మతి పొందెను. తర్వాత హంసద్వీపాధిపతి, తన కుమార్తె చిత్రపటముతో తన దూతను మహాసేనుని దూతతోపాటు అలకాపట్టణమునకు పంపెను. "మీరు మహాసేన మహారాజుతో నిట్లు విన్నవింపుడు. మీ వియ్యము మాకు సమ్మతమే. రాజకుమారుడు వివాహార్థము ఇచ్చటికి వచ్చునా, రాజకుమార్తెయే మీ పట్టణమునకు రావలయునా, తెలుపుడు." అని చెప్పి ఆ దూతలను పంపివేసెను. దూతలిరువురును అలకాపురము చేరి, మహాసేనునికి మందరదేవుని ప్రతిసందేశము తెలియజేసిరి. మహాసేనుడు మిగుల సంతృప్తి పడి, రాజకుమారి చిత్రపటమును అంతఃపురమునకు పంపెను. రాణివాసము వారందరును దానిని చూచి, తమ రాజకుమారుడగు సుందరసేనునకు ఆమె తగిన వధువని సంతోషపడిరి. పిదప మహాసేనుడు దైవజ్ఞులను రావించి వివాహ ముహూర్తమును నిశ్చయము చేయుడనెను. వారు మూడు నెలల తర్వాత ముహూర్తమున్నదని చెప్పిరి. రాజు ఆ ముహూర్తమునే ఏర్పాటు చేసి, సుందరసేనుడే హంసద్వీపమునకు వివాహమునకై వచ్చునని మందరదేవునికి శుభపత్రిక వ్రాయించి అతని దూతకిచ్చి పంపెను.

హంసద్వీపమున మందారవతి సుందరసేనుని చిత్రపటమును చూచినప్పటి నుండియు, ఎప్పుడతని చూతునా,

ఎప్పుడు పెద్లాడుదునా యని ఉవ్విళ్ళూరుచుండెను. వివాహ ముహూర్తము మూడు నెలల పిదప యని తెలిసి రాజకుమారికి చాల విచారము కలిగెను.. ఆ కాలవిలంబమునకు ఆమె ఓర్వజాలక కృశించెను. ఆమె సఖులు ఆ వృత్తాంతమును మందర దేవునికి తెలియజేసిరి. అతడు మంత్రులతోను, బంధుగులతోను సమాలోచించి మందారవతిని సపరివారముగ అలకాపురికి పంపుట ఉచితమని నిర్ణయించెను. అంతట మందారవతి మహామాత్యుడు, సఖీజనము, పరివారము వెంట రాగా, ధన కనక వస్తువాహన పూర్ణముగు ఓడనెక్కి అలకాపురమునకు బయలుదేరెను. ఓడ కొన్నాళ్ళు బాగుగనే ప్రయాణము చేసెను. కాని అంతలో భయంకరమగు ఝంఝూమారుతము చెలరేగెను. మెరుపులనెడు పచ్చని కన్నులతో తమాలవృక్ష సమూహమువంటి నలుపుతో, భయంకరములగు ఉరుములను గర్జనలతో కాలమేఘుడు రాక్షసునివలె పైకి వచ్చెను. ధారా సంపాతముగ వర్షము కురియసాగెను. ఆ పెనుగాలి వానకు సముద్రము ఉల్లోల కల్లోలమాయెను. ఒక్కొక్క తరంగము కైలాసమువలె ఆకాశమునంటసాగెను. మందారవతి యోడ ఆ తరంగ డోలికలలో ఊగియూగి తుదకు పగిలెను. మహామాత్యునితో గూడ పరివారమంతయు మునిగెను. ధన కనకాదులు కడలిలో కలసెను. మందారవతి తుపానుదెబ్బకు మూర్ఛిత



ఆయెను. ఆ స్థితిలో ఆమె కడలి తరగలకు కొట్టుకొనివచ్చి గట్టుచేరెను. అంతయును భవితవ్యత చెయిదము!

కొంతసేపటికి ఆమెకు మెలకువవచ్చెను. తాను ఒంటరిగ సముద్రతీరమున నిర్జన ప్రదేశమున తాటిచెట్ల నడుమ నుండుటచూచి, ఆమె మిగుల భయపడెను. ప్రియుని ఎడబాసిన చక్రవాకివలె, గుంపునుండి విడివడిన లేడివలె కూయిపెట్టెను. "అయ్యో తండ్రీ! అయ్యో అమ్మా! ప్రియతమా! సుందరసేన రాజకుమారా! మీరందఱును ఎక్కడనున్నారు? నన్ను కాపాడుడు! రక్షింపుడు!" అని గట్టిగా విలపించెను.

ఆమె ఏడుపు సముద్రస్నానమునకు తన కూతురు జమున యను దానితోపాటు వచ్చుచున్న మతంగుడను ముని చెవిన బడెను. మతంగుని ఆశ్రమము సముద్రవేలయందే గలదు. అతడు త్వరితముగా స్త్రీ విలాపధ్వనివచ్చు దిక్కునకు వచ్చిచూచెను. విలాపాక్షరములతో, దీనమైన ముఖముతో, నిట్టూర్పులతో వాడిన పెదవులతో వాడి రూపుకట్టిన శోకమూర్తివలె నున్న మందారవతిని చూచి, మాతంగముని మనస్సు కరగెను. కరుణాసింధువగు ఆముని ఊరడించి "కుమారీ, భయపడకుము. వైక్లబ్యము వదలుము. ఇక్కడికి ఎట్లు వచ్చితివి? నీ దుఃఖమునకు కారణ మేమి? ఈతనువున విపత్తులు చిరకాలము ఉండవు. నీ సంగతి చెప్పుము." అని

ప్రశ్నించెను. రాజకుమారి అతని సమాశ్వాససుధతో మరల జీవితము పొందినట్టిదై తన వృత్తాంతము విన్నవించెను. ముని ఆమె మాటలు విని యోగదృష్టితో గ్రహించి "పుత్రీ, నీవు నాతోగూడ నా యాశ్రమమునకు రమ్ము. అట నా కుమార్తెతో గూడ నివసింపుము. త్వరలో నీ వాంఛితము నెరవేరును." అని నచ్చజెప్పి, ఆమెను తన ఆశ్రమమునకు పిలుచుకొనిపోయెను. మందారవతి ఆ ఆశ్రమమున సుందరసేన ప్రాప్తికిని, ఆపన్నివారణమునకును వ్రతము పూని మతంగ మునికి సేవచేయుచు కాలము గడుపుచుండెను.

ఇట అలకాపట్టణమున, సుందదసేనుడు ఎప్పుడెప్పుడు పెండ్లిముహూర్తము దగ్గరిలునా యని ఎదురు చూచుచుండెను. ముహూర్తసమయము దగ్గరిలెను. సుందరసేనుడు తండ్రియాజ్ఞ గైకొని, వివాహోచిత మంగళ కార్యములు ముగించి, విపుల సైన్యముతో హంసద్వీపమునకు బయలుదేరెను. అతని సైన్యములోని గుర్రములగిట్టల తాకిడికి భూమండలము దద్దరిల్లెను. అతడు సముద్రతీరమున నున్న శశాంకపురమును చేరెను. దాని పాలకుడగు మహేంద్రాదిత్యుడు సుందరసేనునికి ఎదురేగి, సపరివారముగ నతనిని తననగరుకు పిలుచుకొనిపోయి సత్కరించెను. సుందరసేనుడు ఆనాడచట విశ్రమించి, మరునాడు, మహేంద్రాదిత్యుడు వెంటరాగా, తానును మిత్రులును, మహేంద్రాదిత్యుడును



నొక ఓడలో నెక్కి, తక్కిన వారిని మరికొన్ని యోడలలో నెక్కించి హంసద్వీపమునకు పయనమయ్యెను. ఓడలు అన్నియును అనుకూల వాతములవలన వేగముగ పోవుచుండెను. మూడు నాలుగు నాళ్ళ తర్వాత పెద్దగాలియు వానయు కొట్ట సాగెను. ఆ గాలివానకు సుందరసేనుని యోడలు చెల్లాచెదురై దిక్కొకటిగా కొట్టుకొనిపోయెను. సుందరసేనుడున్న యోడపగిలి లోపలికి నీరు రాదొడగెను. సుందరసేనుడును మహేంద్రాదిత్యుడును, తక్కినవారును సముద్రములోపడి ఈద దొడగిరి. సుందరసేనుడు దృఢబుద్ధియను మిత్రునితో పాటు ఎట్లోగట్టుచేరి భుజగకుటిలమగు విధి విలసితమునకు ఆశ్చర్య సంతాపములు పొందుచు ఇట్లు దుఃఖింపసాగెను: "హా సుందరీ! మందారవతీ, ఇంత ప్రయత్నించినను మనము కలిసికొనలేక పోయితిమి హీనపుణ్యుల సంకల్పము లెట్లు ఫలించును? మిత్రులకు దూరమైతిని. ప్రయత్నములు విఫలము లాయెను. నేను బ్రతికియుండి ప్రయోజన మేమి?" ఇట్లు దుఃఖించుచున్న రాజకుమారునితో దృఢబుద్ధి "దేవా, ధైర్యము వహింపుము. ముందు ముందు మనకు మేలుకలుగునని నాకు దోచుచున్నది. మనలను దైవమెట్లు బ్రతికించెనో అట్లే తక్కిన వారినికూడ బ్రతికించియుండును. అందరమును మరల ఒక్కటిగ చేరగలమని నాకు విశ్వాసమున్నది." అని ఊరడించెను. వారిట్లు చింతపడుచుండగా, సముద్ర

స్నానార్థము వచ్చిన తాపసులు వారిని చూచి, "నాయనలారా, పూర్వజన్మకర్మ బలీయమైనది. అదియే మనకు సుఖదుఃఖము లొసగునది. దానిని తప్పించుట దేవతలకును సాధ్యముకాదు. దుఃఖమును పోనాడుటకు సుకృతము చేయవలెను. ఆ సుకృతకార్యాచరణమునకు దేహము ముఖ్యము. దేహముండిన పురుషార్థములను సాధింపనగును, నీవు శుభలక్షణయుతుడవు. తప్పక నీకు శుభములు కలుగును" అని ఓదార్చి వారిరువురిని తమ స్నానానుష్ఠానానంతరము తమ ఆశ్రమమునకు గొనిపోయిరి. సుందర సేనుడు తన మిత్రునితోగూడ మంచికాలమును నిరీక్షించుచు అచట కొన్నాళ్లుండెను

సముద్రమున చెదరిపోయిన తక్కిన యోడలు ఎట్లో శశాంకపురీతీరమును చేరెను. సుందర సేనుని తక్కిన మిత్రులును, సైనికులును అలకాపురికి తిరిగి వెళ్ళిరి. రాజకుమారుడు లేక సైన్యము మాత్రము తిరిగి వచ్చుటచూచి. వారి వలన సముద్రమున జరిగిన వృత్తాంతమును విని. మహాసేన మహారాజు పిడుగుపడినట్లు "హాపుత్ర!" అని విలపించుచు కూలిపోయెను. రాణియగు శశిప్రభయు, అంతఃపుర కాంతలును బిట్టుగా నేడ్చిరి. తెగిపడిన ముత్యాలహారములను చూడగా భూదేవియే ముత్యములను కన్నీటిబొట్లు కురిపించుచు నేడ్చినట్లుండెను. మహాసేనుడు విరక్తికలిగి పరివారముగా



నగరము వెలువడి, నగరము వెలుపలనున్న శివాలయమున తపస్సు చేయుచు గడుపసాగెను.

అట మందారవతితోపాటు అలకాపురికి పయనమైన పరిజనములలో కొందరు బ్రతికి బయటపడి హంసద్వీపము చేరిరి. వారి వలన సకల వృత్తాంతమును వినిన మందర దేవుడు మిగుల కొందలమంది, రాజ్యమును నమ్మిన మంత్రుల కప్పగించి, భార్యా సహితుడై సముద్రము దాటి అలకాపురి చేరెను. అలకానగరమున, "హా! మందారవతీ! పుత్రీ! హా పుత్రకా, సుందర సేనా! హా మహాసేన మహారాజా!" యని ఆక్రోశించుచు తిరుగసాగెను. మహాసేనుడు అతనికి ఎదురేగి, తానును దుఃఖించెను. సమాన దుఃఖముగలవారు కలిసికొని నప్పుడు దుఃఖగ్రంథి విడిపోవుట సహజము. వృద్ధామాత్యులు వారిని "దేవా, మహాసేనా, దేవా మందరదేవా, పలువురు సముద్రములో మునిగి తప్పించుకొని వచ్చినవారున్నారు, మన రాజకుమారుడును, అతనివధువును అట్లే సజీవులై మరలవత్తురు." అని పెక్కు నిదర్శన కథలతో ఓదార్చిరి. రాజు లిద్దరును పత్నీ సమేతముగా, నియతాహారులై, శివార్చనా పరాయణులై మంచి కాలమునకై వేచియుండిరి

తాపసుల యాశ్రమముననున్న సుందర సేను డొకనాడు మిత్రునితోగూడ వాహ్యాళి వెడలి దైవవశమున మందారవతియున్న మతంగాశ్రమము సమీపమునకు

పోయెను. ఆశ్రమమున చల్లనినీడనిచ్చు ఫలవృక్షములలో నానావిధమగు పక్షులు మధురధ్వని చేయుచుండెను. సమీపముననే యొక వాగు పారుచుండెను వాగులో కొందరు మునికన్యలు జలకమాడుచుండిరి. వారి నడుమ నొక సుందరియగు కన్య తారాగణము నడుమ రోహిణివలె అతనికి కనిపించెను. నిదానించిచూడగా ఆమె ముఖమున నేదియో దుఃఖచిహ్నము కనిపించెను. స్నానమాడు తాపసకన్యలను చూచుట తగదని వారిరువురును వేరొకదారినిపట్టిరి. ఇంతలో హాహాకారములు చెలరేగెను "ఓ వనదేవతలారా, మునీశ్వరులారా, కాపాడుడు కాపాడుడు! కాపాడుడు! మా సఖి మందారవతిని మొసలిపట్టుకొనినది. అయో! రక్షింపుడు!" అని తాపసకన్యలు కేకలు వేయసాగిరి. మందారవతియను మాటవినగనే సుందరసేనుడు మిగుల నాశ్చర్యపడి, పరుగునవచ్చి, వాగులోదూకి, తనసురియతో మొసలిని చంపి, మందారవతిని రక్షించి గట్టున పరుండబెట్టెను. చెలికత్తెలు అరటి ఆకులతో విసరగా, ఆమెకు మెలకువ వచ్చెను, ఆమె కన్నులు తెరచి రాజకుమారునిచూచి "నేను ముందు చిత్తరువులో చూచిన రాజకుమారుడితడే. ఆ సోయగము, ఆ సౌరు అవియే," అని సిగ్గుపడెను. రాజకుమారుడు ప్రక్కనున్న మునికన్యలను "ఈ లావణ్యలలితాకాయరియగు కన్యక ఎవరు? ఎవరి కుమార్తె?" అని



ప్రశ్నించెను. "మహానుభావా, ఈమె పేరు మందారవతి, హంసద్వీప రాజకుమార్తె. తండ్రి యానతితో నిషధదేశ రాజగు మహాసేనుని కుమారుడగు సుందరసేనుని పెండ్లియాడుటకు జలయానములో అలకాపురికి బయలువెడలెను. సముద్రమధ్యమున నావ పెనుగాలికి విరిగిపోగా, దైవవశమున తరగలతో గట్టునకు కొట్టుకొనివచ్చెను. మతంగముని యకస్మాత్తుగా ఈమెనుచూచి, ఆశ్రమమునకు తోడ్కొనివచ్చెను. అప్పటినుండి అతడు ఈమెను తన పుత్రికవలె పోషించుచున్నాడు." అని మునికన్యలు తెలిపిరి. ఆవృత్తాంతమువిని రాజకుమారుడు ఆనందమున మునిగెను. మునికన్యలడుగగా సుందరసేనుని మిత్రుడగు దృఢబుద్ధి సుందరసేనుని వృత్తాంతమును చెప్పెను. మందారవతియును సుందరసేనుడును పరస్పర వృత్తాంతములువిని, కన్నులనుండి ఆనందబాష్పములు జలజలరాలగా, కొంతసేపు విశ్చేష్టలయిరి. కొంతతడవునకు సుందారవతి తెప్పరిల్లి, "ఆర్యపుత్రా!" అని విలపించుచు సుందరసేనుని పాదములపై వ్రాలెను. వారిరువురును పెద్దకాలము విలపించి దుఃఖోపశమనము చేసికొనిరి.

మునికన్యలు పోయి, ఆ వృత్తాంతమును మతంగమునికి ఎరుకపరచిరి. మతంగముని తన కుమార్తెయగు యమునతోకూడ నదీతీరమునకు ఏతెంచెను. సుందరసేను

డును, దృఢబుద్ధియు, తక్కినవారును అతనికి నమస్కరించిరి. మతంగముని వారందఱిని తన యాశ్రమమునకు దోడ్కొనిపోయి ఆతిథ్యమిచ్చి, కొంతతడవు విశ్రమించిన తర్వాత సుందరసేనునితో నిట్లు పలికెను :— "కుమార, నే నొక పనికై ఇప్పుడు శ్వేతద్వీపమునకు పోవలసియున్నది. నీవు మందారవతితో నలకాపురమునకు పొమ్ము. నేను ఈమెను పుత్రీవత్తుగా భావించి కాపాడితిని. ఇప్పుడు తండ్రివలె నీకు సమర్పించుచున్నాను. నీవు ఈమెతోగూడ చిరకాలము భూమిని పాలించగలవు. త్వరలో నీ బంధుమిత్రులతో కలియుదువు."

పిదప రాజకుమారుడు ఆశ్రమమున అందరి యొద్ద సెలవుగైకొని, మందారవతితోను, దృఢబుద్ధితోను సముద్ర తీరముచేరి, రేవున లంగరువేసిన ఒక వ్యాపారయోడను చూచెను. ఆయోడలో పయనించిన త్వరలో అలకాపురి చేరుదుమను ఆశతో, ఓడయజమానుని, ఆ ఓడలో పయనించుటకు అనుమతికోరెను. ఓడ యజమానుడగు వ్యాపారి మందారవతినిచూచి దుర్బుద్ధితో సుందరసేనుని అభ్యర్థనకు అంగీకరించెను. సుందరసేనుడు గట్టుననుండి మందారవతిని మొదట ఓడనెక్కించి, తాను ఎక్కునంతలో వ్యాపారి నావికులకు కనుసన్న చేయగా వారు ఓడను ముందునకు నడిపించిరి. సుందరసేనుడు గట్టున వెనుకకు పడెను, మందార



వతి గోడుగోడని యేడ్చుచుండగా, ఓడ సుందరసేనునికి అగపడకుండ పోయెను. సుందరసేనునికి మిగుల దుఃఖము కలిగెను. దుష్టమగువిధి తననింకను పీడించుచున్నదని భావించెను. దుఃఖభారమునకు, తన యెదుటనే ప్రియురాలిని మోసగాండ్రు హరించుచుండగా రక్షింపలేకపోయితినేయను లజ్జాభరమునకు అతడు మూర్ఛిల్లెను. దృఢబుద్ధి యుపచారమువలన అతడు మూర్ఛ తెలిసి, ఉన్మత్తునివలె ఎచ్చటికో తరలెను. దృఢబుద్ధి అతనిని నీడవలె అనుసరించెను.

సుందరసేనుని చూడలేకయో అన్నట్లు సూర్యుడు పడమటి సముద్రమున మునిగెను. సుందరసేనుని శోకాగ్ని జ్వాలయే మంజిష్ఠారాగముతో రూపుగొన్నదో అన్నట్లు సంధ్యారాగమున జగత్తు ఎఱ్ఱనాయెను. అతని శోకాగ్ని నుండి పుట్టిన పొగలా అన్నట్లు చీకట్లు దిక్కులను క్రమ్మెను. ఆ చీకటిలో వారు దారి తప్పి కారడవి చేరిరి. అచ్చట ఎచ్చట చూచినను కుచ్చులు కుచ్చులుగా వ్రేలాడు చమరీమృగకేశములును, గాలికి కొట్టుకొనుచున్న పచ్చపులి తోళ్లను రాసులుగా వేసిన గజ మాంసములును, అంబుల పొదలును, మృగములను పట్టు వలలును ఉండెను. కుక్కలు మొరుగుచుండెను. వానిని వికృతరూపులగు శబరులు శ్మశానమును పిశాచములు కావలి కాచునట్లు కావలి కాచుచుండిరి. వారిరువురును అదియొక శబరపల్లి యని

గ్రహించి. వానిని తప్పుకొని పోవుటకు ప్రయత్నించిరి. ఇంతలో ధనుర్బాణధారులగు పలువురు శబరులు వారిని ముట్టడించిరి రాజకుమారుడును జంకుగొంకులు లేక వారితో తలపడి పలువురిని గూల్చెను. కాని, ప్రియావియోగము మార్గాయాసము మొదలగు కారణములవల్ల సొమ్మసిల్లి పడి పోయెను. శబరులు వారిని పట్టుకొని, పగ్గములతో కట్టి కొని పోయి చెఱసాలలో పడవేసిరి.

ఆశ్చర్యము! ఆ చెఱసాలలో సుందరసేనుడు తనతో పాటు హంసద్వీపమునకు బయలుదెడలి తుఫానులో ఓడ పగులగా కకావికలైపోయిన తన పరివార జనమును గాంచెను వారును అతనిని గుర్తుపట్టిరి. అతని అడుగులపై పడిరి. వారిని అతడు కన్నుల బాష్పములు నిండగా కౌగ లించుకొనెను. అందరును దుఃఖింపసాగిరి. తక్కినా బందీలు వారిని చూచి, "అయ్యలారా! ఏల ఏడ్చెదరు? మన పూర్వజన్మకర్మమును తప్పింప శక్యమా? మన కందఱకును ఒక్కనాడే మృత్యువు ఆసన్నమగుట వింత. ఈ శబర రాజగు వింధ్యకేతువు మనలనందఱను రాగల చతుర్దశినాడు దుర్గాం బకు బలివేయునట. కనుక దుఃఖించి ప్రయోజనము లేదు. విధాత పనులు వింతయయినవి. కీడెట్లు చేసెనో, మేలును నట్లే చేయును" అనిరి. ఆ బందీల మాటలకు సుందర సేనుడు



మున్నగువారు ఊరటపడి, కానున్నది కాకమానదని మొండి ధైర్యముతో నుండిరి.

చతుర్దశి రానే వచ్చెను. శబరులు సుందర సేనుని, అతని అనుచరులను, తక్కినవారిని బలివేయుటకై దుర్గాంబ గుడికి నడిపించిరి. దుర్గగుడిలో విగ్రహము నెదుట బలిపీఠము వద్ద అందరిని నిలబెట్టిరి, రాజకుమారుడు దుర్గకు నమస్క రించి, మనస్సు కలకదేరి భక్తితో "దేవి జయ! జయ! చంద్రచూడా జయ! నీవే అందరికిని తల్లివి. నీ ప్రసన్న దృష్టులతో నన్ను కటాక్షించి యనుగ్రహింపుము." అని ప్రార్థించెను, పూజ ప్రారంభమాయెను. బలి యిచ్చుటకు శబరరాజు వింధ్యకేతువు వచ్చెను. అతడు అందరిని చూచుచు సుందర సేనుని గుర్తుపట్టి "అయ్యో! ఎంత ఘోరము జరిగినది! ఇతడు మన మహారాజు మహాసేనుని కుమారుడు సుందర సేనుడుగదా! నన్ను రాజును చేసినవాడు మహాసేన మహారాజే." అని భటులను మందలించి, సుందర సేనుని పాదములపై బడి. మన్ననవేడి. బలికై పట్టుకొనివచ్చిన వారందరిని విడిపించి, రాజపుత్రుని. అతని అనుచరులను తన నగరుకు గొనిపోయెను. శబరరాజు అచట సుందరసేనుని సంగతులు. తెలిసికొని, అతనిని ఓదార్చెను, సుందర సేనుడు అచట కొంతకాలము గడపెను.

ఇట్లుండగా ఒకనాడు సుందరసేనుడు శబర రాజుతో సల్లాపించు సమయమున అతని సేనాపతి వచ్చి, అంజలి ఘటించి, ఇట్లు విన్నవించెను. "దేవా, మిగుల ధనవంతుడగు నొక సార్థవాహుడు జగదేక సుందరియగు నొక వనితతోపాటు, పరివారముతోపాటు ఈ అడవిని ప్రవేశించినాడు. ఆ వనిత దుఃఖాక్రాంతయై యుండుటగని, సందేహముతో మేము వణిజుని సపరివారముగ గట్టి తెచ్చినాము. ఏమి ఆనతి?" సేనాపతి మాటలను విని ఆ వింధ్యకేతువు రాజపుత్రుని మోము చూచెను. రాజపుత్రుడు తల యూపుట చూచి, వారిని తమ ఎదుటికి తీసికొనిరమ్మని సేనాపతికి ఆజ్ఞ యిడెను. సేనాపతి అట్లే చేసెను. సుందర సేనుడును, మందారవతియు పరస్పరము గుర్తుపట్టి, మూర్ఛితులై కొంతసేపటికి తేరుకొనిరి. వింధ్యకేతువు వణిజుని చూచి కోపముతో "ఏమి? నమ్మినవారి భార్యను హరించుట న్యాయమా?" అని అడిగెను. వాడు భయముతో గడగడ వణకుచు, మాటలు తడబడగా, "అయ్యా! నా పాపమునకు తగిన ఫలము ననుభవించితిని. ఈ రాజకుమారిని వంచించి, ఈమెను నేను అపహరించితిని. ఈ మానవతి నిప్పువంటిది, తాకనైనను తాకలేదు. ఎన్నాళ్ళైనను ఇంక ముండును. మా యూరు చేరిన పిదప వివాహమాడుదమని ఎంచి వెళ్ళుచుండగా మీకు పట్టుబడితిని. పరద్రోహ పరా



యణులకు సుఖమెక్కడిది?" అని మొరపెట్టుకొనెను. శబర రాజు కోపముతో, ముఖము చిట్లించి "ఈ దుర్మతిని చంపివేయుడు. అవకాశమున్నప్పుడు తప్పులు చేసి, ఇప్పుడు నంగనాచి మాటలు మాట్లాడుచున్నాడు." అని యుత్తరువు చేసెను. సుందర సేనుడు అడ్డుపడి "శబరరాజా, ఇతనిని చంపవలదు. వర్తకులకు ధనమే ప్రాణము. శరీరము తృణము. కనుక ధనమును హరించి ఇతనిని వదలిపెట్టుము." అని కనికరముతో పలికెను. శబరరాజు సుందరసేనుని మాట మేరకే ఉత్తరువు చేసెను. ప్రాణములు దక్కినవి గదా, ఇంతయే చాలునని వర్తకుడు కట్టుబట్టలతో, కుక్కలు వెంటబడి మొరుగుచుండగా వెడలిపోయెను.

అనంతరము కొన్నాళ్ళకు వింధ్యకేతువు సుందరసేన మందారవతుల యావద్వృత్తాంతమును వివరించుచు ఒక కమ్మ వ్రాసి ఒక శబర సైనికునితో మహాసేనునియొద్దకు పంపెను. పీయూషము వంటి ఆ వార్త విని మహాసేనుడు, హంసద్వీపాధిపతియగు మందరదేవుడును మహానందము పొంది, తమ తమ నిసువుల చూచుటకై వింధ్యకేతువు శబర పల్లికి బయలుదేరిరి. ఆ వార్తను శబర వార్తాహరుని వలన విని సుందరసేనుడు మందారవతితోను, తన పరిజనముతోను ఆ శబరరాజు వెంటరాగా అలకా నగరమునకు బయలుదేరెను. దారిలో నిరుపక్షముల వారును గలసికొనిరి.

సుందర సేనుడు తన తండ్రికిని, మామగారికిని నమస్కరించెను. మందారవతిని మందర దేవుడు దుఃఖానందములు ముప్పిరిగొనగా ఏమియు పలుకక ధారలుగా కన్నీరు కురిపించెను. అందరును కోలాహలముతో అలకా నగరము ప్రవేశించిరి. పిదప సుముహూర్తమున మందారవతీ సుందర సేనులకు కడు వైభవముతో వివాహము జరిగెను. సుందర సేనుడు దృఢబుద్ధి మొదలగు మంత్రులతో గూడ రాజ్యము పాలించుచు సుఖముననుండెను.

"కావున నాయనలారా, విధివిలాసము కుటిలగతి గలది. మీ సంకల్పము ఫలించు ననుటలో సందేహము లేదు." అని కణ్వముని కృపతో వచించెను. ఈ కథ వినిన పిదప మేమును ధైర్యము తెచ్చుకొంటిమి. అచట కొన్నాళ్లు గడపితిమి.

"పిదప మునీంద్రుని యొద్ద సెలవు తీసికొని, వికటము లగు నడవులను దాటి, తిండి తీర్థములు లేక అటమటించుచు ఈ ప్రదేశమునకు వచ్చి చేరితిమి. ఆకలిగొన్న వారము గనుక ఈ ఫలవృక్షము నెక్కి పండ్లు తింటిమి. తత్క్షణమే పండ్లయిపోయి ఈ బొజ్జగణపయ్య దేవరచెట్టు కొమ్మలకు అంటుకొనిపోయితిమి. ఇప్పుడు, నీ తపోబలమున విడుదల పొందితిమి. మా వృత్తాంత మిది"



మృగాంకదత్తుడు వ్యాఘ్రసేనుడు చెప్పిన కథలు విని, పదగురు మంత్రులను మరల కలసికొన్నందులకు మిగుల నానందించుచు హేరంబ వృక్షమునకు నమస్కరించి, వారితోపాటు మరునాడు ఉజ్జయినికి బయలుదేరెను.

---

8

# వివాహ వృత్తాంతము

**వా**రు ఉజ్జయినికి పోవుచు, దారిలో వింధ్యాటవిని దాటి, వింధ్యాద్రి సానువులనుండి దిగి, గంధవతీ నదిని అతిక్రమించి, కరవీర క్షేత్రము చేరి, మహాకాళేశ్వరుని దర్శించి నమస్కరించి, ఒక వెన్నెల రాత్రియందు ఉజ్జయినీపురిని చూచిరి.

ఆ పురి చుట్టును పరులు చొరరాని కోటయును, కోట కొమ్మలపై అమర్చిన యంత్రాయుధములును, సుభటుల కావలియును ఉండెను. ఇది యంతయును ఆ నిండు వెన్నెలలో వారికి స్పష్టముగ కానవచ్చెను. సంకల్పమునకును ప్రవేశింపరానిదియు, గాలియును చొరరానిదియు నగు ఆ పట్టణ దుర్గమును చూచి మృగాంకదత్తుడు తన మంత్రులతో నిట్లనెను. "ఈ ఉజ్జయినీ రాజగు కందర్పసేనుడు మిగుల ధనవంతుడు. మంత్రులు అతని యెడల మిగుల భక్తి కలవారు. పట్టణము దుర్భేద్యమైనది. ఉపాయమేదియును తోచుటలేదు. నా యింతటి శ్రమమును నిష్ఫలమయినట్లే. దురదృష్టవంతునికి శశాంకవంతుని శశాంకవతి భార్య యగునా ?"



ఇట్లు చింతించుచున్న రాజకుమారుని చూచి మంత్రులందరును ఓదార్పసాగిరి. విక్రమకేసరి బేతాళోత్థాపినీ విద్యతో బేతాళుని సంస్మరించెను. బేతాళుడు వెంటనే వచ్చి, చేతులు కట్టుకొని నిలుచుండిరి. "స్వామీ యేమి ఉత్తరువు ?" అని ప్రశ్నించెను, చెలికాడా, "మా దొర మృగాంకధత్తుడు ఈ ఉజ్జయినీపురి రాజగు కందర్పసేనుని కుమార్తెను శశాంకవతిని పెండ్లాడగోరుచున్నాడు. ఆ కన్య అంతఃపురమున నున్నది. నీవు గగన మార్గమున ఆ కన్యను తెచ్చి అప్పగింపుము" అని విక్రమకేసరి కోరెను. బేతాళుడు అతని మాటలు విని "స్వామీ, మహాకాలుడు ఈ దేశమునకు వరమిచ్చినాడు. దాని ప్రభావము వలన మా మాయలు ఈ దేశమున పనిచేయవు." అని విన్నవించి అంతర్థానము చెందెను.

మృగాంకదత్తుడు బేతాళుడే యేమియును చేయనప్పుడు, యుక్తులతోను, మాయోపాయములతోను ప్రయోజనము కలగదని తలపోసి, దండోపాయ మొక్కటియే సాధనమని నిశ్చయించెను. మంత్రులందరును అతని నిశ్చయమును మేలనిరి. పిదప మృగాంకదత్తుడు వింధ్యనివాసి యగు మాయావటునివద్దకు నీతి నిపుణుడగు శ్రుతధితో పూర్వము మాటయిచ్చిన ప్రకారము తమ సహాయమునకై దుర్గ పిశాచుని శబర సైన్యముతో పంపునట్లు సందేశ

మంపెను. మాయావటుడు దుర్గ పిశాచుని సైన్యముతో పంపెను. మృగాంకదత్తుడు ఉజ్జయిని పరిసరములలో పెద్ద స్కంధావార మేర్పరచెను. శబరులు యుద్ధోత్సాహముతో కోలాహలము చేయుచుండిరి.

శబరబలములు కొన్నాళ్లపాటు విశ్రాంతి తీసుకొన్న పిదప మృగాంకదత్తుడు శబరనాయకులను, తన మంత్రులను పిలిపించి, ఇట్లనెను:— "నెచ్చెలులారా, మనమిక ఆలసించుట యెందులకు? మనము ఈ సేనావాహినితో నుజ్జయినిపై పడుదము".

ఆ మాటలు విని శ్రుతధి వినయముతో నిట్లనెను:— "దేవా మనము బలవంతుల మను మాట నిజమే. కానీ, ఎదిరి బలము మనకు స్పష్టముగా తెలియదు. అదియును. గాక సామదాన భేదములను మూడు ఉపాయములును నిరుప యోగము లయినప్పుడు నాల్గవదియగు దండోపాయమును ప్రయోగింపవలెను. ఇతడు మిగుల శ్రీమంతుడు గావున దానోపాయము ఫలింపదు, భేదోపాయమునకు మనకింకను అవకాశము గలుగలేదు. మన మితనితో వియ్యమంద గోరుచున్నాము. గనుక ముందుగనే దండోపాయమునకు పూనుట లెస్సకాదు. మొదటిదియగు సామమునే ఆశ్ర యింతము అది ఫలింపనియెడల దండోపాయమునకును, దాని తోడ్తోడనే భేదోపాయమునకును పూనుదము."



శ్రుతధి పలుకులను అందరును మెచ్చుకొనిరి. మృగాంక దత్తుడును మిత్రుల మాటను త్రోసివేయలేక అంగీకరించి నీతి కుశలుడు వాక్చతురుడు నగు శ్రుతధినే కందర్పసేనుని యొద్దకు రాయబారమంపెను.

శ్రుతధి మరునాడు దూతోచిత వేషముధరించి పరా క్రమ వంతులగు ఇరువురు శబర వీరులు వెంటరాగా కోట కావలివారి యనుమతిపొంది లోపల ప్రవేశించి కందర్ప సేనుని ఆస్థానమును సమీపించెను. కందర్పసేను డప్పుడు పేరోలగమున నుండెను. శ్రుతధి ద్వారపాలకులతో తన రాక కందర్పసేనునికి తెలిపెను. కందర్పసేనుడు అతనిని ఆస్థానమున ప్రవేశపెట్టుడని ద్వారపాలకులకు ఆజ్ఞాపించెను. శ్రుతధి దూతోచితముగా ప్రవర్తించి యిట్లు విన్నవించెను:— "మహారాజా మీకు స్వస్తి. నేను అయోధ్యా వల్లభుడగు అమరదత్త మహారాజు కుమారుడగు మృగాంకదత్తుని మిత్రు డును మా రాజకుమారుడు దేవరకు ఇట్లు విన్నవింప నన్ను పంపెను:— "దేవా మీకొక కన్య శశాంకవతి యను పేరు గలది కలదు. ఆమెను నాకు ఇచ్చి వివాహము చేయుము." దేవా మునుపటి వైరమును మనమున నుంచుకొనక ఈ వియ్యము నకు అంగీకరింపుడు."

శ్రుతధి మాటలకు కందర్పసేనుడు మిగుల ఆగ్ర హించెను. "అయోధ్యాధీశులు ఎప్పటికిని మాకు పగతురే.

వారితోనా వియ్యము ! దూతా, పొమ్ము. మీ రాజకుమారునితో నామాటగా ఈ సంగతినే తెలియజేయుము." అనెను.

శ్రుతధి వినయముతో "మహారాజా తమరు మృగాంకదత్తుని చూడకయే ఇట్లు నుడువుచున్నారు. అతడు మహాపరాక్రముడు; లోకోత్తర గుణవంతుడు. అత్యంత సుందరుడు. అతడు తమ కుమారితకు అనురూపుడగు వరుడు. అతడు అల్లుడగుట మీ అందరి భాగ్యము" అనెను. కందర్పసేనుడు, అతని మాటను లెక్కసేయక వెడలిపొమ్మని యుత్తరువు చేసెను.

శ్రుతధియును కోపముతో "రాజా. ఎన్నియోసిద్ధులు పొందిన పదుగురు మంత్రులున్న మృగాంకదత్తుని శేకువను గుర్తింపలేకున్నారు. రేపు యుద్ధరంగమున మీకును అతనికిని గల యంతరము తెలిసికొనియెదరు" అనెను.

శ్రుతధి మాటలకు కందర్పసేనుడు మండిపడెను. "ఓయీ, గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించి నట్లున్నది. నీవు దూతవు కనుక నీ మాటలు వింటిమి. ఇక మా ఎదుట నుండకుము. దూత అవధ్యుడు గనుక నీవు బ్రతికిపోయితివి పొమ్ము" అనుచు కందర్పసేనుడు సింహాసనమునుండి లేచి ఆస్థానమును వీడెను.



శ్రుతధి ఇక చేయునదేమియును లేక మృగాంకదత్తుని శిబిరమునకు మరలివచ్చి యావద్వృత్తాంతమును అతనికి విశదీకరించెను. రాజకుమారుడు మొదటినుండియే యుద్ధమును కోరుచున్నవాడు. ఇప్పుడు సామోపాయము భగ్నమయినది గనుక యుద్ధమునకు ఆయత్తపడుడని తన సేనానాయకులకు ఆజ్ఞచేసెను. సేనావాహిని కోలాహలము మిన్నుముట్టెను. మృగాంకదత్తుడు తానే సేనాపతిగా బలములను నడపుచు ఉజ్జయినీ దుర్గమును ముట్టడించెను

కందర్పసేనుడు ఆ వృత్తాంత మెరిగి దండుతో కోట వెలుపలికి వచ్చెను. ఇరువాగులును సంగ్రామము సేయ నారంభించెను. సైనికులు తమ తమ పరాక్రమములు చెప్పుకొనుచు ఒకరిపై నొకరు లంఘించిరి. పైరులపై మిడుతల దండు పడినట్లు బాణములు సైనికులపై పడుచుండెను. కత్తి దెబ్బలకు ఏనుగుల కుంభస్థలములు పగిలి, వానినుండి ముత్తెములు రాలుచుండెను. గుఱ్ఱముల సకలింపులతో, ఏనుగుల ఘీంకారములతో, భటుల వీరాలాపములతో, రణభేరీ ఢాంకారములతో జగమే అల్లోలకల్లోలమయినట్లుండెను. ఎటుచూచినను తెగిపడిన కళేబరములతో విరిగిన ఆయుధములతో ఆ ప్రాంతమంతయును మృత్యులీలా మహోత్సవ మండపము వలె నుండెను. ఇట్లు భయంకరముగా పోరు ఐదు దినములు కొనసాగెను.

అప్పుడు శుకాది మారువేసమున ఉజ్జయిని ప్రవేశించి. రహస్యము లన్నియు కనుగొని, తిరిగివచ్చి మృగాంకదత్తునితో నిట్లనియె:— "దేవా, సమరమున జయము సంశయాస్పదము. కావున యుక్తితో కార్యసిద్ధికి ప్రయత్నింతము. నేను మారువేసముతో ఈ పట్టణమును గాలించి వచ్చితిని. అంతఃపురోద్యానమున శశాంకవతిని చూచితిని, ఆమె సఖీ బృందముతో నగరువెడలి తండ్రిమేలుకొరకు అమ్మవారిని ఆరాధించుటకు ఉద్యానవనముననున్న గౌరీ దేవ్యాలయమునకు బయలు దేరినది. నేను అదృశ్యకరణీ విద్యాప్రభావమున వారికి కానరాకుండ వారివెంట నడిచితిని. ఆమె తన చెలి కత్తియతో సంభాషించుచు "సఖీ, ఈ యుద్ధము నాకారణముగా కలిగినది, నాయనగారు యుద్ధములో ఓడిపోయినచో నన్ను ఆ రాజకుమారునికి ఇచ్చి పెండ్లిచేయుట నిశ్చయము, రాజులకు రాజ్యములు ముఖ్యమైనవిగాని, బిడ్డలయెడల ప్రేమవాత్సల్యములు అంతగా ముఖ్యమైనవి కావు. ఆరాజకుమారుడు ఎట్టివాడో! ఏమో! నాకు తగినవాడో? కాడో! కురూపుడగు మగనికంటె కాలునిచేరుట మేలు, కనుక, నీవు మారువేసమున కోటవెడలి ఎదిరిదండులోనికి పోయి, ఆ రాజకుమారుడు ఎట్టివాడో, చూచిరమ్మ" అనెను. ఆ చెలికత్తెపేరులో మాత్రమేగాక నేర్పులోను చతురిక, ఆమె మనస్కంధావారమునకువచ్చి నిన్ను చూచి, నీ గుణగణము



లను, విని, రాజకుమారి యొద్దకు మరలిపోయి, "రాజకుమారీ, ఏమని చెప్పుదును. ఆరాజకుమారుని సౌందర్యమును బ్రహ్మ కూడ పొగడలేడు. స్త్రీలలో నీవును, పురుషులలో నాతడును సాటిలేనివారు. మీ వివాహము లోకోత్తరము కాగలదు" అనెను అప్పటినుండి ఆమె నిన్నే పెండ్లియాడ నిశ్చయించినది. నీకును, తండ్రికిని మేలుగలుగవలయుననియు, యుద్ధము ఆగిపోయిన శ్రేయమనియు తలపోయుచు, దేవిని ధ్యానించుచున్నది. ఆమె మనకు అనుకూల. కావున మనము రాత్రి మారువేసమున నగరుచొచ్చి, ఆమెను అపహరించి, వడిగల గుఱ్ఱములపై పాటివత్తము. పిదప కందర్పసేనునితో మంతనములు జరుపుదము."

మృగాంకదత్తునికి ఆతనిమాటలు నచ్చెను, శబర నాయకులును అంగీకరించిరి. బుద్ధిమంతుడగు నొక్కడు బహుశ్రేయస్సంపదల సాధనమునకు సహాయుడగును గదా!

ఇట కందర్పసేనుని అంతిపురమున శశాంకవతి పోరు ముగియనందులకు వ్యాకులపడుచుండెను. "అయ్యోనాకై పోరులో ఎందరో మడియుచున్నారు. ఏమి నా దుర్విధి, ప్రాత వైరములు పెట్టుకొని నాయనగారు పోరు తప్ప మరియొకటి ఆలోచింపరు." అని ఆలోచించి, ఈయుద్ధ పరిణామ మెట్లుండునో యని అనుమానించుచున్నది.

మృగాంకదత్తుని సాహసగాథలు వినియున్నది గావున అతనినే పెండ్లియాడ నిశ్చయించెను. యుద్ధము ప్రారంభమయిన ఆరవ నాటి సాయంకాలమున చంద్రోదయము కాగానే, ఉద్యానవనములోని గౌరీదేవి ఆలయమునకు పోయి, మృగాంకదత్తునే భర్తనుగా ప్రసాదింపుమని దేవిని ప్రార్థింపసాగెను. గౌరీదేవి మారుపలుకక ఆగ్రహించినదని భావించి రాజకుమారి ఉరిత్రాటితో ప్రాణములను బాయుటకు ఉద్యమింపగా, గౌరీదేవి ప్రత్యక్షమై "పుత్రీ, చింతింపకుము. నీకు పూర్వజన్మమునందును మృగాంకదత్తుడే భర్త. ఈ జన్మమునందు అతడే భర్తయగును. అతడు ఇచ్చటనే యున్నాడు." అని ఊరడించి అదృశ్యురాలాయెను. తర్వాత అచ్చటనే తన మిత్రులతో పొంచియున్న మృగాంకదత్తుడు రాజపుత్రి యొద్దకువచ్చి, తనను తెలియజేసికొనెను అదివరకు చెలికత్తెలవలన అతని రూపసౌందర్యాదులను వినియున్నది. కావున శశాంకవతి ఆవర్ణనముకంటెను మహాసుందరుడగు అతనినిచూచి సంభ్రమాశ్చర్యములతో ఏమియు తోచక సిగ్గుతో ముఖమువంచి నిలబడిపోయెను. మృగాంకదత్తుడు ఆమెతో సంకల్పమువలె వేగముగా పరువెత్తు గుఱ్ఱమునెక్కి నగరమునుండి రహస్యద్వారమున వెలువడి తన స్కంధావారము చేరెను అతని మిత్రులును, దుర్గపిశాచుడు మొదలగు శబరనాయకులును సంతోషించిరి.



శశాంకవతిని మృగాంకదత్తుడు [illegible] పోయెననువార్త వేగులవారివలన కదర్పసేను[illegible] అతడు క్రోధోగ్రుడై తన సేనానాయకుని [illegible] ఏనూఱుమంది మూలబల సైనికులతో [illegible] కొనుటకు ప్రయత్నింపుము. వాడు ప్రాణము[illegible]తో [illegible]రికెనా సరియే, లేకపోయిన చంపివేయుము." అని [illegible] యుత్తరువు చేసెను. వారును పవనవేగముతో బయలు వెడలిరి, కాని, వారిశ్రమము వృథాయయ్యెను మృగాంకదత్తుడు తనసైన్యముతో శబరరాజగు మాయాపటుని పట్టణమునకు తరలియుండెను. కందర్పసేనుని సైనికులు అతనిని పట్టుకొనజాలక మరలివచ్చిరి. కందర్పసేనుడు, "ఇక యుద్ధము ఆపుడు!" అని తన స్కంధావారమునకు ఉత్తర్వుచేసి, ఉజ్జయినికి వెనుదిరిగెను.

పిదప, మృగాంకదత్తుడు తన వృత్తాంతమును తండ్రియగు అమరదత్తునికి తెలియజేయుటకై మిత్రుడగు భీమపరాక్రముని అయోధ్యకు పంపెను. అమరదత్తుడు ప్రధానమంత్రియగు వినయవంతునిమాటలు విని తన కుమారుని వెడలగొట్టిన తర్వాత ఆప్తులవలనను, గూఢచారుల వలనను నిజము గ్రహించెను. మృగాంకదత్తుడు తనపై అభిచారహోమాద్యులుచేసి కీడు తల పెట్టలేదనియు, వినయవంతుడు జెప్పినది మిథ్యాదూషితమనియు బోధియాయెను. తన పనికి

...శ్చాత్తాపపడి, వినయవంతుని చెఱసాలలో
వృత్తా...రాక్రముని చూడగానే మహా రాజునకు—
...వచ్చెను. ఆతనిని తన కుమారుని వృత్తాంత
...మ్ము యడిగెను. భీమ పరాక్రముడు సవిస్త
...మృగాంక దత్తుని వృత్తాంతమును తెలిపి, అతనిని
ఆనంద పరవశునిచేసెను. అనంతరము అమరదత్తుడు తన
కుమారుని చూచుటకై బంధుమిత్ర పరివార సహితముగా,
శబర రాజపురికి బయలువెడలెను. కొన్నాళ్ళకు శబరరాజ
పురిచేరి, శశాంకవతీ, సహితుడగు మృగాంకదత్తుని చూచి
ఆనందము చెందెను, మృగాంకదత్తుడను, శశాంకవతియును
అమాత్య పుత్రులును అమరదత్తునికి నమస్కరించిరి. అతడు.
తన పుత్రుని, అమాత్య పుత్రులను కౌగలించుకొని కుశల
ప్రశ్నలడిగి, ఆదరించెను. అమరదత్తుడు కొన్నాళ్ళచ్చట
ఆనందముగా గడిపి పిదప మృగాంకదత్తుడును, శశాంక
వతియును, మంత్రికుమారులును వెంటరాగా తన రాజధాని
యగు అయోధ్యకు మరలిపోయెను.

ఇక ఉజ్జయినిరాజగు కందర్పసేనుడు తన మంత్రుల
తోను, ఇష్టులతోను ఆలోచించెను, శశాంకవతిని విధ్యుక్త
ముగ మృగాంకదత్తునికిచ్చి వివాహ మొనర్చుట లెస్సయని
వారు రాజునకు విన్నవించిరి. కందర్పసేనుడు తన తనయు
డగు. నయసేనుని సువర్ణరత్నాద్యమూల్య వస్తువులతోను



హస్త్యశ్వ రథములతోను, దాసదాసీ[illegible]
ధ్యకు పంపెను. నయసేనుడు నయవిశారదు[illegible]
యదనుచూచి అమరదత్తుని దర్శించి, [illegible]
వివాహ శుభముహూర్తమును నిర్ణయింప[illegible]
యగు నయసేనుడు వచ్చెనన్న వార్తవిని శశాంకవతి[illegible]
ముదమందెను. అమరదత్తుడును, తక్కినవారును నయసే
నుని మాటలకు ప్రీతులయి, కందర్పసేనుని సమయజ్ఞతను
మెచ్చుకొనిరి.

అమరదత్తుడు జోస్యులను పిలిపించి వివాహ ముహూ
ర్తమును పెట్టించెను. ముహూర్తనిర్ణయము కాగానే, సంభా
రములను సంపాదించుటకు సేవకులను నియమించెను
అయోధ్యానగరమును ఆ నాటి రామపట్టాభిషేక సమయ
మున అలంకరించినట్లు అలంకరించిరి. నయసేనుడు శశాంక
వతికి అరణముగా తండ్రియగు కందర్పసేనుడిచ్చిన ధనమును
అప్పగించెను, ముహూర్తదినమునాడు పేరటాండ్రు మృగాంక
దత్తుని, శశాంకవతిని మంగళస్నానము చేయించిరి. వధూవరు
లిరువురును పెండ్లియరుగుపై గూర్చుండిరి. ప్రతిసరబంధము,
లాజహోమము, సప్తపది మొదలగు వైదిక సంప్రదాయము
మేరకును, కోసలరాజుల వైభవమునకు అనుగుణముగను
వివాహ విధి నెరవేరెను. దేశదేశములనుండియు అనేకులు
వివాహమును చూడవచ్చిరి. వచ్చిన అతిథుల విడిది యే

...పట్టణమాయెను. నయసేనుడు తన చెల్లె
వృత్తా ...లకు రత్నాభరణములను, దాసదాసీజనములను,
...మృగాంకదత్తునికి రత్న ఖచితమైన యొరగల
...హూకరించెను. పెండ్లికివచ్చిన యతిథులను
...రించి వీడ్కొల్పెను.

అనంతరము కొన్నాళ్ళకు నయసేనుడు శశాంకవతి యొద్దను, ఇత...లయొద్దను సెలవుగైకొని యుజ్జయినికి వెడలెను. శబరరాజగు మాయావటువు, ఇతర శబర నాయకులు తమ పట్టణమునకుపోయిరి

శశాంకవతియును, మృగాంకదత్తుడును అన్యోన్యము మహాప్రేమతో లక్ష్మీనారాయణులవలెను, గౌరీశంకరులవలెను రతీమన్మథులవలెను ఒప్పారుచు సుఖముగానుండిరి.

ఇట్లుండగా అమరదత్త మహీపతి కడు వృద్ధుడాయెను. అతని చెవియొద్ద నెరసిన వెంద్రుకలు "ఐశ్వర్యమనుభవించితివి. వయస్సు ముదిరినది. ఇక వానప్రస్థమునకు కాలము సమీపించెను సుమా!" యని తెల్పినట్లుండెను. ఆ మహారాజొకనాడు మంత్రులను రావించి, "అమాత్యులారా, నా వయస్సును గడచినది. యమదూతవంటి ముదిమి పట్టుకొన్నది. నేను సుఖభోగములలో నుండుట న్యాయ్యముగాదు. అట్లు సుఖభోగముల ననుభవించుట కాపురుషుల లక్షణము. ఇదుగో, నా కుమారుడు. ఇతని పరా

పట్టాభిషేకమహోత్సవము వారము వినోదములతో నడచెను. ఎనిమిదవ వృత్తా ...రపాలుడు సతిసమేతుడై వారణాసికి ...మృగాంకదత్తుడును, అయోధ్యాపుర ...మారమువరకు సాగనంపిరి. అమర ...సిలో మూడుపూటల గంగాస్నానము అసి... యొద్దను, ఇత...శ్వరుని గొలుచుచు, కందమూలఫలము శబరరాజగు ...లె గడుపుచు అంత్యమున కైవల్యమును పట్టణమునకుపోయి

శశాంకదత్తుడు తన పదునొకండుగురు మంత్రులతో మహాప్రేమతో ...కునివలె వెలుగొందుచు, శ్రుతధి రతీమన్మథులవలెనుండుచు శత్రువులకు చండశాసనుడుగను, ప్రజలకు చంద్ర శీతలుడుగాను రాజ్యమేలెను. క్రమ ముగా, భూమినంతయు జయించి, సార్వభౌముడాయెను. చకో రమును వెన్నెల అలరించునట్లు శశాంకవతియు మృగాంక దత్తునికి నిరంతరానందము కలిగించుచు అదర్శ భారతనారీమణి పేరువడసెను.